Photo by Pram



బహుమతి
పొందిన వ్యాఖ్య

గంగాభరణములు

పంపినవార
ఎం. ఎం

# చందమామ

ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు



ఇవిగాక తమాషాలు, ఫొటోశీర్షికల పోటీ
మొదలైన మరి ఎన్నో ఆకర్షణలు.


పండ్లయొక్క
సహజ
రుచిని
అనుభవించుటకు
అనుకూలమైనవి
పార్లేవారి
స్వీట్లు మరియు
టాఫీలు
గ్లూకోజ్‌తో చేయబడినవి
Parle's SWEETS
Parle's SWEETS
పార్లే ప్రోడక్ట్స్ మాన్యుఫాక్చరింగ్ కంపెని ప్రైవేట్ లిమిటెడ్. బొంబాయి.
PS.58-I TEL.
EVEREST



# సముద్రపు జాలర్లు

కేరళ రాష్ట్రంలో నీలి అరేబియా సముద్రాన్ని ఆనుకుని కనుల పండువైన మలబారు వుంది. ఇక్కడ చూడ చోద్యమైన రమణీయమైన ప్రదేశాలు చాలా వున్నాయి. కాని సముద్ర తీరాన కొబ్బరితోటల చుట్టూ వున్న బెస్త పల్లెం శోభ వేరు.

మలబారు బెస్త పల్లెలో మట్టితో చక్కగా కట్టబడిన పూరిగుడిసెలు, ఎదురుగా కనిపించే సముద్రతీరం తళ తళ మెరిసే యిసక చూచితీరవలసిందే. దృఢకాయులైన జాలరివాళ్లు వర్షాకాలంలో గాలి ఉధృతంగా వీస్తున్నప్పుడు, సముద్రపు పోటు వచ్చినప్పుడు తప్ప ఏడాది పొడుగునా చేపలు పడుతుంటారు. ప్రొద్దు పొడవకుండా సముద్రం మీదికి వెళ్ళి, సంధ్యవేళకు మోయలేనన్ని చేపలతో తిరిగి వచ్చి ఇరుగు పొరుగు గ్రామాల్లో, పట్టణాల్లో అమ్ముకుంటారు. చేపల వేట అయ్యాక వలలను, పడవలను మరమ్మతు చేసుకొని, కొబ్బరి తాళ్ళు అల్లుకుంటారు. నిస్సందేహంగా చాలా కష్టమైన పని. అయినా వీలున్నప్పుడల్లా నలుగురూ చేరి టీ త్రాగుతూ కబుర్లు చెప్పుకుంటారు. వారి ప్రియమైన టీ బ్రూక్ బాండ్ అని వేరే చెప్పక్కర్లేదు. దేశపు అన్ని చోట్లలాగే మలబారులో కూడా బ్రూక్ బాండ్ టీ తోట పదును తాజాగా సరఫరా అగుటచే చిన్నా పెద్దా కూడా అదే త్రాగుతుంటారు.

మలబారు కొబ్బరికాయలకు, జీడిపప్పు, ఏలకులు, లవంగాలు, రబ్బరుకు చాలా ప్రసిద్ధికెక్కింది. అయినా ఆ బెస్త పల్లె దానిలో నివసించే అమాయకపు బెస్తలు దానికి ఎక్కువ శోభ చేకూరుస్తున్నాయి. వారి జీవనోపాధికి ఆధరువైన సముద్రమంటే జాలర్లకు చాలా అభిమానం. వీరు పనికి వెళ్ళేముందు, తిరిగి వచ్చాక బ్రూక్ బాండ్ టీ త్రాగుతారు. ఏమంటే అది ఉత్సాహము, ఉల్లాసము చేకూరుస్తుంది.

బ్రూక్ బాండ్ ఇండియా ప్రైవేట్ లిమిటెడ్.

BB 297



# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

ఈ సంచిక నుంచీ "అహింసాజ్యోతి" అనే పేరుతో గౌతమ బుద్ధుడి జీవితకథ త్రివర్ణ చిత్రాలతో సీరియల్‌గా ప్రచురిస్తున్నాం. బుద్ధుడి బోధల ప్రభావం ఈనాటికీ ప్రజలపైన ఉన్నది. ప్రాణులన్నిటినీ సమంగా భావించి వాటిని హింసించకుండా ఉండటం బుద్ధుడు మానవులకు నేర్పిన గుణపాఠాలలో ఒకటి.

హింస పాపమని నమ్మిన మరొక కుర్రవాడి విచిత్రగాథనుకూడా మీరీ సంచికలో చదవనారంభిస్తారు. ఆ కథపేరు "మూడు పరీక్షలు." అరేబియా దేశంలో బదావీలు రక్తపాతానికి ప్రసిద్ధికెక్కినవారు. అటువంటి జాతిలో పుట్టి కూడా కనానా అనే కుర్రవాడు ఒక్కచుక్క రక్తపాతం చెయ్యకుండా వీరాధివీరులను సైతం తలదన్నే సాహసకృత్యాలు చేస్తాడు. ఈ కథ చరిత్రకు సంబంధించినది.

సంపుటి 24 : జనవరి 1959 : సంచిక 1



SANKAR

## అట్టి విూదిబొమ్మ

కృష్ణుడు వెళ్ళిపోగానే విదురుడు కుంతీదేవి వద్దకు వెళ్ళి, "అమ్మా, నేను ఏది వద్దనుకున్నానో అదే జరగబోతున్నది. యుద్ధం జరిగితీరుతుంది," అన్నాడు.

అప్పుడు కుంతీదేవి తనలో ఈ విధంగా ఆలోచించుకున్నది: "యుద్ధం చాలా ప్రమాదకరమే. దుర్యోధనుడి పక్షాన భీష్మ ద్రోణ కర్ణులు పోరాడతారు. అయితే భీష్మ ద్రోణులకు నా కొడుకులపై ఆదరాభిమానాలున్నాయి; ఒక్క కర్ణుడే నా కొడుకులపైన పగపట్టి ఉన్నాడు. వాణ్ణి ఎలాగైనా ప్రసన్నుణ్ణి చేయగలిగితే బాగుండును. వాడూ నా కొడుకేగదా! ఆ సంగతి వాడితో చెప్పేస్తాను!"

ఇలా ఆలోచించుకుని కుంతి భాగీరథీతీరానికి ప్రయాణమై వెళ్ళింది. అక్కడ కర్ణుడు స్నానంచేసి, తూర్పుగా తిరిగి, చేతులు పైకెత్తి జపంచేసుకుంటూ ఆమెకు కనిపించాడు. కుంతీదేవి అతని వెనుకగా కూర్చున్నది.

కర్ణుడు తన జపం పూర్తిచేసి కుంతిని చూసి, భక్తితో నమస్కారంచేసి, "దేవీ, ఏ పనిమీద వచ్చావు? నావల్ల ఏంకావాలి?" అన్నాడు.

"నాయనా, నువు కుంతి కొడుకువుకావా? రాధ కొడుకునని ఎందుకంటావు? రాధ నిన్ను మోసికన్నదా? నేను కన్యగా ఉన్నప్పుడే సూర్యుడి దయవల్ల నిన్ను కన్నాను. పూర్వం అర్జునుడు గెలిచిన రాజ్యాన్నంతా కౌరవులు కాజేశారు. ఆ రాజ్యాన్ని నీ తమ్ములైన పాండవులతో కలిసి నువే ఏలుకో, బాబూ! బలరామకృష్ణులలాగా మీరు సఖ్యంగా ఉండండి," అన్నది కుంతీదేవి.

"అమ్మా, సూతుడుగా పెరిగిన నన్నిప్పుడు క్షత్రియుణ్ణి కమ్మంటే కాగలనా? నీ మాటలు విని పాండవులతో చేరిపోతే నన్ను పిరికివాడని లోకం ఆడిపొయ్యదా? నాకు కౌరవులు చెయ్యని మర్యాదలేదు. నన్ను చూసి దుర్యోధనుడు యుద్ధానికి సిద్ధమవుతున్నాడు. నే నతని పక్షాన పోరాడితీరుతాను. నీ కొడుకులలో అర్జునుడు తప్ప మరెవ్వరి ప్రాణాలూ తీయనని అభయం ఇస్తున్నాను. యుద్ధంలో నేనో అర్జునుడో చచ్చితీరాలి. అర్జునుడుపోతే నేను నీ కొడుకులలో ఒకడినవుతాను. నేనుపోయినా, అర్జునుడుపోయినా నీకు అయిదుగురు కొడుకులుంటారులే!" అన్నాడు కర్ణుడు.

"నాయనా, విధి నీచేత ఇలా మాట్లాడిస్తున్నది. దాన్ని ఎవరు తప్పించగలరు?" అని కుంతి కర్ణుణ్ణి దీవించి తన ఇంటికి తిరిగివచ్చింది

# అమూల్యమైన వస్తువు

ఒక రాజుకు దేవుడు, శంఖుడు, అమందుడు అని ముగ్గురు కొడుకులు. ఒకప్పుడు ఆ దేశపు సేనానాయకుడు సైనికులకు లంచాలుపెట్టి, వారిని తన పక్షం చేసుకుని రాజును చంపి, రాజకుమారులను దేశభ్రష్టులనుచేసి తానే రాజయాడు.

ముగ్గురు రాజకుమారులూ పగలల్లా ప్రయాణంచేసి రాత్రివేళ ఒక పేదరాసి పెద్దమ్మ ఇంటికి వెళ్లి అక్కడ వితర్కించుకున్నారు. "ప్రపంచంలోకల్లా విలవైనది సంపద. అది ఉంటే ఇంక దేన్నయినా సాధించవచ్చు," అన్నాడు దేవుడు. "కాదు, సైనికబలం. అది ఉండబట్టే మన సేనాని మనని దేశభ్రష్టులను చేశాడు," అన్నాడు శంఖుడు. "కానేకాదు. వాడు సైనికులను డబ్బుతో కొన్నాడు. డబ్బే ప్రధానం," అన్నాడు దేవుడు.

"మనం ముగ్గురమూ మూడు దిక్కులకూ వెళ్లి, మనకు అమూల్యమైనవని తోచిన వాటిని సంపాదించి తిరిగి పదేళ్లకు ఇక్కడే కలుద్దాం!" అన్నాడు శంఖుడు. మర్నాడు దేవుడు తూర్పుగానూ, శంఖుడు పడమరగానూ బయలుదేరి వెళ్లారు. ఉత్తరంగా బయలు దేరిన అమందుడు కొద్దిసేపట్లో వెనక్కు తిరిగివచ్చి, పేదరాసిపెద్దమ్మ కూతుర్ని పెళ్లాడి అక్కడే ఉండిపోయాడు. పదేళ్లు గడిచాయి. దేవుడు తూర్పునుంచి అంతులేని బంగారం తీసుకుని ఒక పెద్ద బిడారుతో వచ్చాడు. పడమటినుంచి శంఖుడు పెద్ద సేనతో వచ్చాడు.

"చూశావా ? నా బంగారంతో నీ సేననంతా కొనగలను!" అన్నాడు దేవుడు.

"అసంభవం. నేను శంఖంపూరించానంటే నా సైనికులు నీ బిడారును క్షణంలో రూపుమాపేస్తారు," అన్నాడు శంఖుడు. ఇంతలో ఇంట్లోనుంచి అమందుడు బయటికి వచ్చాడు.

"అప్పుడే వచ్చేశావే! నీవు సంపాదించిన అమూల్య వస్తువేమిటి ?" అని అన్న లిద్దరూ వాణ్ణి అడిగారు. "సంతృప్తి!" అన్నాడు అమందుడు వారితో.





# అచ్చిరాని బందిపోటు

ఒకప్పుడు కన్యాకుబ్జ నగరానికి దూరంగా ఉన్న అరణ్యంలో ఒక దొంగల ముఠా ఉండేది. ఆ దొంగలు అప్పుడప్పుడూ నగరం మీద పడి దోపిడీలు చేసి ధనం తెచ్చి అరణ్యంలో తాముండే చోట దాస్తూ ఉండే వారు. నగరంలో దోపిడీలు చేసే వీలు లేనప్పుడు గ్రామాలమీదపడి దోచుకునేవారు.

ఒకసారి ఈ దొంగలు నగరంలో దొంగ తనాలు చెయ్యటానికి నిశ్చయించారు. అందుకోసం వాళ్ళు ముందుగానే మారు వేషాలలో నగరమంతా తిరిగి ఏయే ఇళ్ళు కొల్లగొట్టాలో తేల్చుకున్నారు. వారికి రెండు ఇళ్ళు దొరికాయి. ఒకటి ఒక లోభి ఇల్లు. ఆ లోభి దగ్గిర ఎంత ధనం మూలుగుతున్నదీ ఎవరికీ తెలీదు. ఎప్పుడూ చినిగిన బట్టలు వేసుకుని అతి బీదవాడిలాగా కనబడేవాడు. పగలు ఇల్లు దాటి పోవలిసివస్తే ఇంటికి మూడు తాళాలు వేసి మరీ వెళ్ళేవాడు. రాత్రి చీకటి పడకముందే తలుపులన్నీ మూసుకుని పడుకునేవాడు. ఇంటో ఆ పిసినిగొట్టుకు తోడెవ్వరూ లేరు.

దొంగలు దోచటానికి నిశ్చయించిన రెండో ఇల్లు ఒక క్షత్రియుడిది. ఈయన చాలా ధనికుడు. ఇంటినిండా నౌకర్లే. ఆయనకు వేటాడటమూ, అడవిమృగాలను ప్రాణాలతో పట్టుకుని తెచ్చి తన ఇంట బోనులలో ఉంచటమూ సరదా.

ఈ రెండు ఇళ్లనూ దోచుకోవటానికి దొంగలు రెండు ముఠాలుగా చీలారు. పెద్ద దొంగతనాలు చేసే ధైర్యసాహసాలు లేని ముగ్గురు దొంగలుమటుకు తామొక జట్టుగా బయలుదేరి నగరంలో చిన్న చిన్న ఇళ్లు దోచటానికి నిశ్చయించారు.

రెండు రోజులలో వారు తమ ప్రయత్నాలన్నీ పూర్తిచేసుకుని మూడో రోజు రాత్రి నగరం ప్రవేశించారు.

కె. మాధవరావు



చిన్న ఇల్లు దోచటానికి బయలుదేరిన ముఠా ఒక చిన్న మిద్దెమీద ఉండే ముస లవ్వను దోచటానికి నిశ్చయించింది. వీధిలో ఇద్దరిని నిలబెట్టి మూడోవాడు మిద్దె ఎక్కాడు. ముసలవ్వ కుక్కిమంచంలో పడుకుని గురకపెట్టి నిద్రపోతున్నది. దొంగ వాడు ఒక్కొక్క వస్తువే తీసి వీధివేపు ఉన్న పిట్టగోడమీదుగా గిరవాటు వేయసాగాడు. దాదాపు అన్ని వస్తువులూ కింద పారేశాక దొంగకు ముసలిదాని పక్కకూడా కాజేయా లనిపించింది. అందుచేత వాడు ముస లవ్వను మంచంమీదినుంచి కిందకు దొర్లించి పక్కచుట్టటం మొదలుపెట్టాడు.

ముసలిది నిద్రలేచి, "ఇదేం పని, నాయనా. నా వస్తువులన్నీ తీసి ఆ భాగ్య వంతుల ఆవరణలో వేస్తున్నావూ?" అన్నది.

తాను ముసలవ్వ వస్తువులను పారేసింది వీధిలోకి కాదా అని దొంగకు అనుమానం వచ్చింది. తాను పడేసిన వస్తువులను తన అనుచరులు తీసుకున్నారో లేదో చూడటానికి పిట్టగోడదగ్గిరికి వెళ్లాడు. వెంటనే ముసలిది వాడి కాళ్లు పట్టుకుని వాణ్ణి వీధిలోకి తోసే సింది. అలా పడటంలో వాడు మెడ విరిగి వెంటనే చచ్చాడు. మిగిలిన ఇద్దరు దొంగలూ బెదిరి పారిపోయారు.



లోభి ఇల్లు దోచబోయిన ముఠా అర్ధ రాత్రివేళ ఆ ఇంటివద్దకు చేరింది. ఇల్లంతా కోటలాగా ఉన్నది. తలుపు పగలకొట్టిగాని లోపలికి పోయే అవకాశం లేదు.

"తలుపు విరగదోస్తే చప్పుడవుతుంది; చుట్టుపక్కలవాళ్లు లేచి మన పనికి విఘ్నం కలిగిస్తారు. అందుచేత చాకుతో తలుపు తొలిచి చెయ్యి పట్టే కంతచేసి లోపలి గడియ తీస్తాను!" అన్నాడు ముఠా నాయకుడు.

అయితే వాడు చాకుతో తలుపు తొలుస్తూ ఉండగానే లోపల ఉన్న లోభి మేలు కున్నాడు. దొంగ తగినంత కంతచేసి గడియ



అందుకోవటానికి చెయ్యి లోపల పెట్టేసరికి ఆ లోభి వాడి అరచేతిలో నుంచి తలుపులోకి ఒక పెద్ద మేకు దిగవేశాడు. దొంగ చెయ్యి తలుపుకు పట్టుకుపోయింది.

ఈలోపుగా లోభి కిటికీలు తెరిచి, "దొంగలు! దొంగలు!" అని నాలుగువైపు ఇళ్లవాళ్లకూ వినపడేటట్టు పెడబొబ్బలు పెట్టాడు. పొరుగిళ్లవాళ్లు గడ్డపారలూ, కొడవళ్లూ, గండ్రగొడ్డళ్లూ, కర్రలూ తీసుకుని లోభి ఇంటివేపు పరిగెత్తుకు రాసాగారు.

"తమ్ములారా, మనం పారిపోవాలి. నా చెయ్యి తెగగొట్టండే నేను మీతో పారిపోలేను. నన్ను పట్టుకున్నారంటే చిత్రవధ



చేస్తారు. అందుచేత దయచేసి నా చెయ్యి తెగగొట్టండి!" అని ముఠా నాయకుడు తన వారిని వేడుకున్నాడు.

వారు అలాగే చేసి తెగిన చేతికి దొరికినన్ని పైబట్టలు కట్టి, దారిపొడుగునా రక్తం మరకలు పడి తమ జాడ బయట పడకుండా జాగ్రత్తపడ్డారు. తరవాత వారంతా సత్తువ కొద్దీ అడవికేసి పరిగెత్తారు. కాని పుర జనులు వారిని విడిచిపెట్టక వెంటపడ్డారు.

చెయ్యి తెగిన దొంగ మిగిలిన వారితో పరిగెత్తలేక కత్తితో ఆత్మహత్య చేసుకుని దారిలో పడిపోయాడు. మిగిలినవారు చావు తప్పి కన్ను లొట్టపోయి తమ స్థలానికి చేరుకున్నారు.

క్షత్రియుడి ఇల్లు దోచటానికి బయలుదేరినవాళ్లు చాలా పెద్ద ప్రయత్నం చేశారు. తమ ప్రయత్నం ఫలించటానికి తగిన విధంగా వారు జాగ్రత్తపడ్డారు. అడవిలో తాము పట్టుకున్న ఒక ఎలుగుబంటిని చర్మం ఒలిచి, ఎండబెట్టి, అందులో మంచి సాహసి అయిన తమ అనుచరుణ్ణి ఒకణ్ణి పెట్టి కుట్టారు. దొంగతనం చేయదలచిన రోజు సాయంకాలమే ఇద్దరు దొంగలు వేటగాళ్లలాగా వేషాలు వేసుకుని, తమ అనుచరుణ్ణి ఒక బోనులో పెట్టి క్షత్రియుడి

ఇంటికి తీసుకుపోయి, "మహారాజా, ఈ ఎలుగుబంటిని తమకు కానుకగా తెచ్చాం. పుచ్చుకోండి!" అన్నారు. క్షత్రియుడు వారి మాటలు నమ్మి నౌకర్లతో "ఒరే, దీన్ని మన ఎలుగుబంట్లతోపాటు పెట్టండి!" అన్నాడు.

దొంగలు కంగారుపడి, "అయ్యా, దీనికి రోగంవచ్చి ఇప్పుడిప్పుడే కోలుకుంటు న్నది. అందుచేత దక్షిణపు గాలి తగిలేచోట ఇంటోనే ఉంచండి," అన్నారు. క్షత్రియుడు అందుకు ఒప్పుకుని వారికి బహుమానం ఇచ్చిపంపాడు.

అర్ధరాత్రి అందరూ సుఖంగా నిద్రపోయే వేళ ఎలుగుబంటి చర్మం కప్పుకున్న దొంగ బోనులోనుంచి బయటికివచ్చి క్షత్రియుడి ఇంటి తలవాకిలి తెరిచాడు. బయట వేచి ఉన్న దొంగలందరూ లోపలికి వచ్చారు.

"ఖజానా అంతా పడమటివైపు గదిలో ఉన్నది. దీపాలు పెట్టేవేళ దాదాపు మణుగు వెండిసామాను ఆ గదిలో పెట్టారు. ఆ గది తాళపుచెవులు పెద్ద పహరావాడి దగ్గిర ఉన్నాయి. వాడు వసారాలో నిద్రపోతాడు," అని ఎలుగుబంటి దొంగ చెప్పాడు.

వాడి అనుచరులు పెద్ద పహరావాణ్ణి చంపేసి తాళపుచెవుల గుత్తి సంపాదించారు. వాళ్లు ఖజానా గదికేసి వెళుతూ తమ అను చరుడితో, "నువ్విక్కడే తిరుగుతూ ఉండు.





ఒకవేళ ఏ నౌకరైనా లేచినా నిన్నుచూసి భయపడి కిక్కురు మనకుండా లోపలపోయి దాక్కుంటాడు!" అన్నారు. ఎలుగుబంటి దొంగ సరేనని ఆవరణలో అటూ ఇటూ తిరగసాగాడు.

బోనులోనుంచి తప్పించుకున్న ఎలుగు బంటిని చూసి క్షత్రియుడి నౌకర్లు బెదురు తారనుకోవటంతో దొంగలు పప్పులో కాలు వేశారు. వాళ్ళకు అడవిమృగాలు అలవాటే.

దొంగలు ఖజానాలోకి దూరిన కొద్దిసేపటికి ఒక నౌకరు లేచి ఆవరణలోకి వచ్చాడు. బోనులో ఉండవలిసిన ఎలుగుబంటి బయట తిరుగుతూండటం వాడికి కనిపించింది. వెంటనేవాడు కేకపెట్టి మిగిలినవాళ్లందరినీ కేకవేశాడు. నౌకర్లు దివిటీలతోనూ, ఈటెల తోనూ, కత్తులతోనూ వచ్చి ఎలుగుబంటి దొంగను చుట్టుముట్టారు. ఈలోగా ఎవరో వేటకుక్కలను వదిలారు. అవి ఎలుగు బంటి దొంగను పట్టుకుని పీకసాగాయి. దొంగ బయటికి పోదామని ప్రయత్నించాడు గాని నౌకర్లు తలుపు మూసేశారు. ఎలుగు బంటి దొంగ తన ప్రాణం రక్షించుకునే టందుకు గోళ్ళతో కుక్కలను పీకసాగాడు. వెంటనే ఒక నౌకరు ఈటెతో వాడి డొక్కలో పొడిచి వాణ్ణి చంపేశాడు.

చచ్చిపోయిన ఎలుగుబంటి దొంగను సమీపించగానే నౌకర్లకు అది నిజమైన ఎలుగుబంటి కాదని తెలిసిపోయింది. వాడు దొంగ అయి ఉండాలి. వాణ్ణి తెచ్చి బహు మానంగా ఇచ్చినవాళ్ళూ దొంగలే అయి ఉండాలి. ఈ దొంగ బోనులోనుంచి బయ టికి వచ్చి తన అనుచరులను ఇంటిలోపలికి రానిచ్చి ఉంటాడు.

ఈ సంగతులు స్ఫురించగానే నౌకర్లు ఖజానా గదికి పరిగెత్తారు. అక్కడ వారికి మిగిలిన దొంగలు దొరికిపోయారు.

ఈ విధంగా ఆ రాత్రి దొంగలు తలపెట్టిన బందిపోటు సర్వనాశనంతో ముగిసింది.






# 7

[చంద్రవర్మ నదిలో పడి కొట్టుకుపోయి, ఒకానొక అడవి మధ్య ఒడ్డుపట్టాడు. అతడు కొంతసేపటికి తెప్పరిల్లి అడవిలో ప్రవేశించేసరికి, చెట్లనుంచి మూలుగులూ, కేకలూ విని పించినై. అంతలో మూడు తలల సర్పం ఒకటి అతడికి ఎదురైంది. దానిని అనుసరించి పోయి, చంద్రవర్మ కాపాలిని అనే మంత్రగత్తె గృహం చేరాడు. మంత్రగత్తె అతణ్ణి ఆహ్వానించింది. ఆమె తనవద్ద వున్న గాజుగోళంలో వీరపురనగర పరిస్థితినీ, సేనాని ధీరమల్లుడు శత్రువులచే చుట్టుముట్టబడుతూండటాన్నీ చంద్రవర్మకు చూపింది. తరవాత—]

కాపాలిని చంద్రవర్మ భుజంమీద చేయి వేసి, "నాయనా, చంద్రవర్మా అధైర్య పడకు," అన్నది ఆప్యాయంగా. "కష్టాలు కలకాలం వుండవు. తిరిగి ఏదో ఒకనాడు నీ రాజ్యాన్ని జయించుకోగలవు. నాకు వాగ్దానం చేసిన విధంగా సాయపడ్డావంటే, ఆ తరవాత నీకు అన్నివిధాలా తోడ్పడతాను.'

కాపాలిని మాటలు చంద్రవర్మకేమాత్రం వుత్సాహం కలిగించలేదు. నూరు యోజనాల అవతల వున్న శంఖుడనే మాంత్రికుడి మంత్రగృహం ప్రవేశించి, కాపాలిని కోసం తను ఒకానొక వస్తువును సంగ్రహించుకు రావాలి. ఆ ప్రయత్నంలో తను చావకుండా బయటపడగలిగితే—అప్పుడు కాపాలిని తనకు చేస్తానన్న సహాయం వుపయోగ పడుతుంది. అలాకాక తను మరణిస్తే...

చంద్రవర్మ ఆలోచిస్తున్న విషయం ఏదో గ్రహించినదానిలా కాపాలిని ఒక్కసారి





నిట్టూర్చి, అంతలోనే చిరునవ్వు నవ్వుతూ, "నాయనా, వర్మా! నీవు ఆలోచిస్తున్న సంగతేదో నేను గ్రహించాను. నువ్వీ నిమిషాన యిక్కణ్ణించి వెళ్లిపోదలిస్తే, వెళ్లి పోవచ్చు; నేను ఆటంకపరచను. కాలనాగు కాని, అడవిలోని చెట్టుచేమలుగాని నీకు ఏమాత్రం హాని చేయవని హామీ యిస్తున్నాను, సరేనా?" అన్నది.

తను యిక్కడినుంచి నిరాటంకంగా వెళ్లి పోవచ్చునన్నమాట వింటూనే చంద్రవర్మ దిగాలుపడిపోయాడు. తను యిక్కడినించి వెళ్లదలిచినా, వెళ్లేందుకు ఒక స్థానం అంటూ ఎక్కడా వున్నట్టు అతడికి కనబడలేదు. ఇప్పటి పరిస్థితుల్లో తను అడవులవెంటా, కొండలవెంటా ఒంటరిగా తిరగటం తప్ప చేయగలిగిందేమీ లేదు. తండ్రి మరణించాడు! రాజ్యం శత్రువుల హస్తగతం అయింది! విశ్వాసపాత్రుడైన సేవకుడు సుబాహుడు కనబడకుండా పోయాడు!

"కాపాలినీ, నేను నీకు నా సర్వశక్తులా సాయపడేందుకు ప్రయత్నిస్తాను. శంఖుడనే మాంత్రికుడి మంత్రగృహం నుంచి నేను తేవలసిన వస్తువేమిటి?" అన్నాడు చంద్రవర్మ వుత్సాహంగా.

కాపాలిని ముఖం వికసించింది. ఆమె మెత్తమీదినుంచి లేచి తన చేత గల మానవాస్థికతో, గోడపక్కన వున్న కొయ్యబొమ్మ తలమీద గట్టిగా కొడుతూ, "భైరవా! మన యింటికి అతిథి వచ్చాడు. త్వరగా విందు భోజనం వడ్డించు," అన్నది.

ఆ వెంటనే ఇల్లు దద్దరిల్లేలా 'హుం' అన్న బొబ్బ కేకతో ఒక మహాకాయుడు ప్రత్యక్షమై, "ఇదుగో, విందుభోజనం!" అంటూ అన్ని రకాల పదార్థాలూ, పిండివంటలూ ఒక బంగారు పళ్లెరంలో తెచ్చి చంద్రవర్మ ముందు పెట్టాడు.

చంద్రవర్మకు ఎక్కడలేని ఆకలీ పుట్టుకొచ్చింది. అతడు భోజనం చేస్తున్నంత





సేపూ ఒకపక్క భైరవుడూ, మరోపక్క కాపాలినీ తృప్తిగా చూస్తూ నిలబడ్డారు. చంద్రవర్మ తినగలిగినంత తిని, మిగిలిన పదార్థాలతో బంగారు పళ్లెరాన్ని దూరంగా తోయగానే, భైరవుడు చేయి కడుక్కొ నేందుకు నీళ్లు తెచ్చాడు.

కాలనాగూ, భైరవుడూలాటి భయంకర శక్తులను తన చేతుల్లో వుంచుకున్న కాపా లిని, శంఖుడి నుంచి తనకు కావలిసిన వస్తువును ఎందుకు తెప్పించుకోలేదు? వాళ్ల కన్న తనలో వున్న అధిక శక్తులేమిటి? ఇందులో ఏదైనా మోసం లేదుగదా? అను కున్నాడు చంద్రవర్మ.

"నాయనా, చంద్రవర్మా! ఇప్పుడు ముఖ్య విషయాలగురించి మాట్లాడదాం. శంఖుడి మంత్రగృహంలో అపూర్వ శక్తులు గల ఒక శంఖం వున్నది. ఒకానొక మూలికతో కాచిన కషాయం అందులో పోసి తాగినవాళ్లకు వృద్ధాప్యం నశించి తిరుగా యౌవ్వనం లభి స్తుంది. వెయ్యేళ్లవరకూ తిరిగి వృద్ధాప్యం వాళ్లకేసి ముఖం చూపదు. ఇప్పటికి పది వందల ఎనభైఏళ్లక్రితం ఆ చికిత్సపొందాను. అప్పట్లో మాంత్రికుడైన శంఖుడు నాకు విరోధికాడు. కాని, ఆ తరవాత అతడికి నాతో బద్ధవిరోధం ఏర్పడింది," అంటూ కాపాలిని చటుక్కున వెనుదిరిగి, అంత దూరంలో నిలబడివున్న భైరవుడికేసి కళ్లురుముతూ చూసి, "ఛీ, నీచుడా! నీ పాడుబుద్ధి పోనిచ్చావుకాదు," అంటూ మానవాస్థికతో అతడి తలమీద బాదింది. వెంటనే భైరవుడు పెద్దగా మూలిగి శపీ మంటూ కొయ్యబొమ్మలా అయిపోయి గోడ పక్కన కూలబడ్డాడు.

"వాడు నీ సేవకుడేగదా, ఎందుకు అంత కఠినంగా కొట్టావు?" అని అడిగాడు చంద్రవర్మ.

కాపాలిని వికటంగా నవ్వింది. "వాడు నా సేవకుడే, కాని వీలయితే నా రహస్యాలు



తెలుసుకుని, నన్ను తుదముట్టించి శంఖుడి దగ్గిరకు పారిపోవటానికి వెనుదీయని నీచుడు. అసలు యీ తుచ్ఛ భూతాలతో వచ్చిన చిక్కే యిది. వాళ్లు సేవచేస్తున్న మాంత్రికులకన్న బలవంతులెవరైనా కని పిస్తే, వారి అండ చేరటానికి ప్రయత్నిస్తారు. అందుకే వాణ్ణి కొయ్యముక్కలా చేసి అక్కడ పడవేసి వుంచుతున్నాను. శంఖుడు నా రహస్యాలు కనుక్కునేందుకు చాలా మందిని పంపాడు. వాళ్లకు పట్టిన దుస్థితి చూశావుగదా ?" అంటూ కాపాలిని ద్వారానికి తోరణంలా వేలాడకట్టిన కపాలాలను చంద్రవర్మకు చూపించింది.




ఆ కపాల తోరణాన్ని చూస్తూనే చంద్ర వర్మ నిలువెల్లా వణికిపోయాడు. ఈ క్షణం వరకూ అతడు వాటికేసి పరీక్షగా చూసి వుండలేదు. శంఖుడు పంపిన దూతలు కాపాలినివల్ల హతమార్చబడి ద్వారానికి తోరణాలయ్యారు. అదే విధంగా కాపాలిని పంపిన దూతలు శంఖుడిచేత చంపబడి అతడి మెడలో హారాలై వుండవచ్చు!

"కాపాలినీ! నువ్వు పంపిన దూతల కపాలాలనుకూడా శంఖుడు యిదే విధంగా వుపయోగించుకుని వుండవచ్చు," అన్నాడు చంద్రవర్మ అనుమానంగా.

కాపాలిని లేదన్నట్టు తల అడ్డంగా తిప్పింది. "నే నింతవరకూ అతడి దగ్గిరకు ఎవరినీ పంపలేదు. ఆ అపూర్వ శక్తులు గల శంఖాన్ని తస్కరించుకు రావాలంటే, అందుకు సమర్థుడైనవా డెవడో నాకు తెలుసు," అన్నది.

"ఆ సమర్థుడైనవాణ్ణి నేనని నీ అభి ప్రాయం, అంతేనా ?" అన్నాడు చంద్రవర్మ ఎంతో ఆశ్చర్యపడుతూ.

"అవును, వర్మా!" అన్నది కాపాలిని వుత్సాహంగా. "నీవు యువకుడివి, అంతే కాక క్షత్రియుడివి, అపైన రాజ్యాన్నీ, బంధు మిత్రులనూ....సర్వం కోల్పోయినవాడివి.




అలాంటి నీకన్న సాహసికుడు నాకెవరు దొరుకుతారు? ఈ ప్రయత్నంలో నీవు జయించావంటే, ఆ తరవాత నీవు రాజువే కాదు, మొత్తం దేశానికే చక్రవర్తివి కాగలవు. దానికి మార్గం ఏమిటో ఆ అపూర్వ శక్తులు గల శంఖాన్ని నా దగ్గిరకు తెచ్చినతరవాత చెపుతాను," అన్నది కాపాలిని.

కాపాలిని మాటలు చంద్రవర్మకు ఎంతో వుత్సాహాన్ని కలిగించినై. కాని, అతడి హృదయంలో ఎక్కడో సలుసంత అనుమానంకూడా లేకపోలేదు. తనచేత ఆ శంఖాన్ని తెప్పించేందుకు కాపాలిని తనకు యీ విధమైన ఆశలు చూపుతూవుండవచ్చు.



"సరే, ఆ మాంత్రికుడుండే చోటుకు వెళ్లవలసిన మార్గం ఏమిటో చెప్పు, బయలు దేరుతాను," అన్నాడు చంద్రవర్మ. అతడిలో ఎక్కడ లేని తెగింపూ వచ్చింది.

కాపాలిని ఇంటి బయటికి దారితీసింది. ఆమె వెనకనే చంద్రవర్మ బయటికివచ్చాడు. సూర్యుడు పడమటి దిక్కుకు జారుతున్నాడు. కాపాలిని ఉత్తర దిక్కుకేసి తిరిగి, చూపుడు వేలితో అటుకేసి చూపుతూ, "ఈ దిక్కుగా నూరు యోజనాల దూరంలో శంఖుడు వుండే కొండా, దానిమీద అతడి మంత్రగృహం వున్నవి. ఆ గృహంలోని పూజామందిరంలో ఆ అపూర్వశక్తులు గల శంఖం ఒక నాగుబాము మెడలో వేలాడుతూ వుంటుంది. ఆ నాగుబాము గోడకు వున్న ఒక మేకుకు వేలాడుతూ వుంటుంది. నువ్వు మాంత్రికుడైన శంఖుడి నుంచి దానిని అతడితో స్నేహంచేసిగాని, లేక మోసంచేసిగాని, ఆఖరుకు ప్రాణం తీసిఅయినాసరే, తేవలసి వుంటుంది," అన్నది.

"అంత గొప్ప మాంత్రికుణ్ణి చంపడం కూడా సాధ్యమేనా?" అన్నాడు చంద్రవర్మ ఆశ్చర్యంగా.

"ఎందుకు కాదు? ఎంత గొప్ప మాంత్రికుడైనా ఏదో ఒకనాడు చావక





తీరదు. శంఖుడు ఇందుకు భిన్నం కాదు. అతణ్ణి హతమార్చటం ఏ విధంగా సాధ్యమో నువ్వే ప్రయత్నించి తెలుసుకోవలసి వుంటుంది," అన్నది కాపాలిని.

"అయితే, యిక నేను బయలుదేరు తాను," అంటూ చంద్రవర్మ తన దుస్తుల కేసీ, ఒరలో వున్న కత్తికేసీ ఓమారు చూసు కుని ముందుకు నడిచాడు.

చంద్రవర్మ రెండు మూడడుగులు వేశాడో లేదో, వెనకనుంచి కాపాలిని ఆత్రంగా ముందుకు వచ్చి, అతడి భుజాన్ని పట్టుకుని ఆపుతూ, "నాయనా, వర్మా! ఒక ముఖ్య మైన సంగతే మరిచిపోయాను. శంఖుడి దగ్గిర ఒక వింతపక్షి వున్నది. దాని బలమూ, వేగమూ చెప్ప నలవికాదు. దానిపేరు అగ్ని పక్షి. అది ప్రతిరోజూ సూర్యాస్తమయంవేళ ఆహార సంపాదనకు బయలుదేరి, తిరిగి నడిరేయికి మాంత్రికుడిగృహం చేరుతుంది. అది ఆకాశంలో ఎగురుతున్నప్పుడు పెద్ద అగ్నిజ్వాలలా ప్రకాసిస్తుంది. దాని గుర్తుల ఆధారంతో, నీవు దారితప్పకుండా మాంత్రి కుడిగృహం చేరవచ్చు. నువ్వు వెళ్ళి రావలసిన దూరం రెండు వందల యోజ నాలు. ఎంత కాలంలో పని పూర్తిచేసు కుని తిరిగి రాగలవు?" అని అడిగింది.



కాపాలిని అడిగిన ఈ ప్రశ్న చంద్ర వర్మకు వింతగా తోచింది. అడవిమార్గానా, కొండదారులవెంటా పడి నూరుయోజనాలు నడవాలి. ఆ తరవాత మహాశక్తివంతుడైన శంఖుణ్ణి లోబరుచుకుని ఆ శంఖం చేజిక్కించుకోవాలి. తిరిగి వచ్చేందుకు నూరుయోజనాలు నడవాలి. మార్గమధ్యంలో ఎన్ని ప్రమాదాలను ఎదుర్కోవలసి వస్తుందో ఆ దేవుడికే తెలియాలి. అలాంటప్పుడు యింత కాలానికి తిరిగి రాగలనని మాట యివ్వటం ఎలా సాధ్యం అవుతుంది?

చంద్రవర్మ ఆలోచనలను పసికట్టిన దానిలా కాపాలిని వెలవెలపోతూ, "అవును,



వర్మా, నువ్వు చేయబూనిన సాహసం నాకు తెలియంది కాదు. కాని, యీనాటినుంచి ఒక్క సంవత్సరంలో నీవు ఆ శంఖం తెచ్చి నా కివ్వగలిగితేనే, దానివల్ల నాకు వుప యోగం వుంది. ఆ గడువుకు ఒక్క రోజు దాటినా అది నాకెందుకూ పనికిరాదు. సరే, ఏ కారణంవల్లనైనా నీవు తిరిగి ఒక సంవత్స రంలో రాలేకపోతే, యిక్కడ నేను వుండను. కాని, నీకు చేస్తానన్న సహాయం మాట మరవను. గాజుగోళం వున్న బల్ల సొరుగులో ఒక తాళపత్రం వుంచి పోతాను. దానిలో ఆ శంఖాన్ని నీ మేలుకు ఎలా వుపయోగించుకోవాలో లిఖించబడి వుంటుంది," అన్నది కాపాలిని.

కాపాలిని అన్న ఈ మాటలతో చంద్ర వర్మకు ఆమెమీద ఎక్కడలేని విశ్వాసమూ కలిగింది. మాంత్రికురాలు తనను మోస గించటం లేదని అతడు నమ్మాడు. ఆ కారణంవల్ల చంద్రవర్మ చటుక్కున మాంత్రికురాలి రెండు చేతులూ ఆప్యా యంగా పట్టుకుని, "ఒక్క సంవత్సరంలో ఆ శంఖాన్ని తీసుకుని నేను తిరిగివస్తాను." అంటూ ఆమెచేతులు వదిలి ముందుకు నడి చాడు. ఆ వెంటనే కాపాలిని, "కాలనాగూ!" అంటూ మూడు తలల సర్పాన్ని పిలిచింది. సర్పం బుసలుకొడుతూ దగ్గిరకు రాగానే ఆమె చంద్రవర్మను సర్పానికి చూపుతూ, "అతడికి అడవి దాటేవరకూ రక్షణగా వుండి రా!" అని ఆజ్ఞాపించింది.

కాలసర్పం ఒక్క దూకున చంద్రవర్మ ముందుకు వెళ్ళి, అతడికి మార్గం చూపుతూ నడవసాగింది. చంద్రవర్మ చెట్లలో కొంత దూరం వెళ్లింతరవాత వెనుదిరిగి చూశాడు. అతడికి కాపాలిని కనిపించలేదు. కాని, ఇల్లు వుండవలసిన చోట గద్ద తలా, రెక్కలూ—సింహశరీరంతో వున్న ఒక పెద్ద వికృతాకారం కంటబడింది.

—[ఇంకా వుంది]



# దుష్టుడితో స్నేహం

ఒకప్పుడు అరణ్యంలో ఒక చెట్టుపైన ఒక కొంగా, ఒక కాకీ నివసిస్తూ ఉండేవి. కాకి చాలా చెడ్డది. ఆ సంగతి తెలిసికూడా, "మనం మంచివాళ్లమైతే ఇతరుల చెడు మనని ఏం చేస్తుంది?" అనుకుని కొంగ కాకితో సహవాసం సాగించింది.

ఒకనా డొక ప్రయాణీకుడు అటుగా వచ్చి ఎండ జాస్తిగా ఉండటంచేత ఆ చెట్టునీడను పడుకుని నిద్రపోయాడు. కొంతసేపటికి ఆ ప్రయాణీకుడి ముఖంమీదికి ఎండ వచ్చింది. ఈ సంగతి గమనించి, మంచిబుద్ధి గల కొంగ తన రెక్కలను చాచి నిద్రపోయేవాడి ముఖంమీద నీడ పడేలాగు చేసింది.

కొంగను చూసి నవ్వి, కాకి వెటకారంగా ప్రయాణీకుడి పైన ఒక రాయి పడవేసి చెట్టుపైనుంచి ఎగిరిపోయింది. రాయిపాటుకు ప్రయాణీకుడు బాధతో లేచి, పైకి చూశాడు. అతనికి చెట్టుపైన ఉన్న కొంగ కనిపించింది. అదే తనపై రాయి వేసి ఉంటుందనుకుని అతను ఆ రాయి విసిరి కొంగను బలంగా కొట్టాడు. ఆ దెబ్బకు కొంగ కిందపడి ప్రాణాలు విడిచింది.





# వెనిస్ వర్తకుడు

పూర్వం వెనిస్‌నగరంలో షైలాక్ అని ఒక యూదు వడ్డీవ్యాపారి ఉండేవాడు. వాడు క్రైస్తవ వర్తకులకు డబ్బు అప్పుపెట్టి అమితమైన వడ్డీ వసూలు చేసి చాలా ధనం గడించాడు. తన బాకీలు వసూలు చెయ్యటంలోనూ, వడ్డీలు తీసుకోవటంలోనూ దయాదాక్షిణ్యాలు కొంచమైనాలేక కర్కోటకుడిలాగా ప్రవర్తించటంచేత షైలాక్‌ను చూసి ప్రతివాడూ ద్వేషించేవాడు. షైలాక్‌కు శత్రువులే తప్ప మిత్రులెవరూ లేరు.

వెనిస్‌నగరంలోనే ఆంటోనియో అనే క్రైస్తవ వర్తకుడొకడు ఉండేవాడు. ఇతను షైలాక్‌కు గర్భశత్రువు. ఎందుచేతనంటే ఈ ఆంటోనియో వడ్డీవ్యాపారికి అన్నివిధాలా పక్కలో బల్లెంలాగా ఉండేవాడు. అతను యువకుడు, దయా స్వభావుడు, స్నేహపాత్రుడు. చిక్కులలో ఉన్నవారికి వడ్డీ లేకుండా అప్పులు పెట్టేవాడు. వర్తకుల కూటంలో ఈ ఇద్దరూ తటస్థపడినప్పుడల్లా ఆంటోనియో షైలాక్ దుర్మార్గాలను అందరి ఎదటా దుయ్యబట్టేవాడు. ఆంటోనియోపై పగ తీర్చుకునే అవకాశంకోసం షైలాక్ ఎంతో ఓపికగా ఎదురు చూస్తున్నాడు.

వెనిస్ పౌరులకు షైలాక్ అంటే ఎంత అసహ్యమో ఆంటోనియో అంటే అంత ఆదరం. అతనికి అనేకమంది మిత్రులుండేవారు. కాని అందరిలోకీ అతని ఆప్త మిత్రుడు బసానియో అనే యువకుడు. బసానియో గొప్పవంశంలో పుట్టినవాడు. అతనికి తండ్రి ఇచ్చిన ఆస్తి బహుకొద్ది. దాన్ని కాస్తా అతను త్వరలోనే ఖర్చుపెట్టేశాడు. ఎందుచేతనంటే అతనికి ధనం లేకపోయినా గొప్పగా బతికే అలవాటు పోలేదు. పిత్రార్జితమంతా హరించిపోయాక బసానియో కేవలం ఆంటోనియో ఇచ్చే డబ్బుతోటే కొంతకాలం కాలక్షేపం చేశాడు.

ఆర్. కోదండరామయ్య

అయితే బసానియో దారిద్ర్యంతీరేరోజు దగ్గిర పడింది. ఎందుచేతనంటే, ఒక ధని కుల ఇంటి పిల్లను ప్రేమించి పెళ్లాడే అవ కాశం అతనికి లభించింది. ఆ పిల్ల పేరు పోర్షియా. ఆమె తండ్రి చనిపోతూ తనకున్న అంతులేని ఆస్తికి ఆమెను వారసురాలిని చేసి పోయాడు. ఆమె వెనిస్‌నగర సమీపంలో బెల్మోంట్ అనే గ్రామంలో ఉంటున్నది.

పోర్షియా తండ్రి బతికిఉన్న రోజులలోనే బసానియో బెల్మోంట్ వెళ్లి ఆమెను తరుచు చూస్తూండేవాడు. పోర్షియా తనను ప్రేమిస్తున్నదని బసానియోకు గట్టి నమ్మకం ఉన్నది. తండ్రిపోయిన కారణంచేత ఆమె పెళ్లి చేసుకోవలిసిన పరిస్థితి ఏర్పడింది. తనను పెళ్లాడమని కోరటానికి బసానియో బెల్మోంట్ వెళ్ల నిశ్చయించాడు.

కాని పెళ్లికొడుకుకు తగిన ఆర్భాటంతో వెళ్లాలంటే బసానియో దగ్గిర డబ్బు లేదు. అందుచేత అతను తన ఆప్త మిత్రుడైన అంటోనియో వద్దకు వెళ్లి తన పరిస్థితి తెలుపుకుని మూడువేలు అప్పు అడిగాడు.

దురదృష్టవశాత్తూ అంటోనియోవద్ద తగి నంత డబ్బు లేదు. సముద్రాలపైన వెళ్లిన అతని వర్తక నౌకలు నేడో రేపో సరుకుతో వస్తాయని ఎదురు చూస్తున్నాడు. అవి వచ్చి



చేరితేగాని అతనికి చేతిలో డబ్బు ఆడదు. అందుచేత అంటోనియో తన మిత్రుణ్ణి వెంట బెట్టుకుని షైలాక్ వద్దకువెళ్లి, "నా నౌకలు రాగానే తిరిగి ఇస్తాను. నాకు మూడువేలు అప్పు ఇయ్యి," అని అడిగాడు.

షైలాక్ తన పగ తీరటానికి ఇది మంచి అవకాశం కావచ్చుననుకుని, "అయ్యా, తమరు నన్ను చాలా సార్లు కుక్కా అని సంబోధించారు; తిట్టారు; శాపనార్థాలు పెట్టారు. దానికి కృతజ్ఞతగా మీకు మూడు వేలు అప్పియ్యమని అడగవచ్చారా? కుక్క వద్ద అప్పిచ్చేటందుకు మూడువేలు ఎలా ఉంటాయనుకున్నారు?" అని అడిగాడు.

"దానికీ దీనికీ ఏమిటి సంబంధం? అవసరమైతే నిన్ను మళ్లీ తిడతాను, దుమ్మెత్తి పోస్తాను. నేను మిత్రుడుగా నీ దగ్గిరకు వచ్చి అప్పు యివ్వమని అడగటం లేదు; శత్రువు కిచ్చినట్టే ఇయ్యి. తరవాత వడ్డీతోసహా నిష్కర్షగా వసూలు చేసుకో!" అన్నాడు ఆంటోనియో.

"ఎందు కలా కోపగించుకుంటారు? నాకు తమ స్నేహం కావాలి. మీరు నన్ను అన్న మాటలన్నీ మరిచిపోతాను. తమకు కావలిసిన డబ్బేదో ఇచ్చుకుంటాను. ఆ మొత్తానికి తమరిని వడ్డీకూడా అడగను!" అన్నాడు షైలాక్.

ఈ మాటలు వింటూనే ఆంటోనియో చాలా ఆశ్చర్యపోయాడు.

"మీరు మూడు వేలూ తీసుకోండి. లాంఛనంగా న్యాయవాదిచేత ఒక పత్రం మటుకు రాయించి ఇవ్వండి. అదైనా సరదా కోసమే. ఫలాని రోజులోపల మీరు డబ్బు ఇవ్వకపోతే మీ శరీరం నుంచి నేను ఒక శేరు మాంసం తీసుకునేటట్టు పత్రం రాయండి. వడ్డీ గిడ్డీ వద్దు. కేవలం సరదాకోసమే. మీరు డబ్బు తిరిగి ఇవ్వలేరనికాదు!" అన్నాడు షైలాక్ ఆప్యాయం నటిస్తూ.

"సరే, నాకేమీ అభ్యంతరం లేదు. నువు ఇంత మంచి వాడవని నాకు తెలియదు.



అలా రాసిన పత్రంపై నేను సంతకం చేస్తాను," అన్నాడు అంటోనియో.

అలాటి షరతుపైన అంటోనియో డబ్బు తీసుకోవటం బసానియోకు ఏమాత్రమూ నచ్చలేదు; అతను అభ్యంతరం చెప్పాడు.

"పిచ్చివాడా, నేను పెట్టే గడువులోగా నా ఓడలన్నీ సరుకుతో వచ్చి చేరతాయి. నువేమీ భయపడకు!" అన్నాడు అంటోనియో.

వారి మధ్య జరిగే సంభాషణ విని షైలాక్, "అయ్యో బాబూ! మీ క్రైస్తవులెంత అనుమానం మనుషులు. ప్రపంచమంతా మీలాగే ఉంటుందా? శేరు మనిషి మాంసం తీసుకుని నేనేం చేసుకుంటాను. ఆయన స్నేహం కోరి ఇలా పత్రం రాయమన్నానే గాని, మీకు అనుమానం ఉంటే డబ్బు తీసుకోకండి," అన్నాడు.

వడ్డీవ్యాపారి మాటలు బసానియో అనుమానాన్ని ఏమాత్రమూ పోగొట్టలేదు. అతను ఎంత చెబుతున్నా వినక అంటోనియో ఆ యూదువాడివద్ద డబ్బు అప్పు తీసుకుని, వాడు కోరిన ప్రకారం పత్రంకూడా రాసి ఇచ్చాడు.

ఆ డబ్బుతో బసానియో చిన్న పరివారాన్ని సమకూర్చుకుని గ్రాషియానో అనే వయస్యుడితోసహా పోర్షియా ఇంటికి తరలి





వెళ్ళాడు. అతను పోర్షియాతో తాను నిర్ధనుడ నని, అయితే తనది ఉత్తమ వంశమనీ చెప్పుకున్నాడు. పోర్షియా అతని గుణగణా లను ప్రేమించింది గాని, డబ్బు గురించి కాదు. ఆమె వద్ద కట్టుకు పోయినంత డబ్బున్నది.

ఆమె ఎంతో నమ్రతతో, "మీకు భార్యగా ఉండే అర్హత సంపాదించటానికి నేనింకా పదిరెట్లు ధనవంతురాలిని కాగూడదా, పది రెట్లు సౌందర్యవతిని కాగూడదా అను కుంటున్నాను. నేను మీకు తగిన విద్యగల దాన్ని కాను. అయినా నా లోట్లన్నీ మీరు తీర్చగలరని ఆశపడుతున్నాను," అన్నది.

పోర్షియా బసానియోను పెళ్ళాడటానికి అంగీరిస్తూ తన వేలి ఉంగరం తీసి అతని కిచ్చింది. ఆనందపరవశుడై బసానియో ఆ ఉంగరాన్ని ఎటువంటి పరిస్థితులలోనూ తన చేతినుంచి తీసి మరొకరికి ఇవ్వనని ప్రతిజ్ఞ చేశాడు.

ఒక వంక బసానియో పోర్షియాల పెళ్ళి నిశ్చయమవుతూంటే, ఇంకొక వంక బసా నియో వయస్యుడైన గ్రాషియానోకూ, పోర్షియా చెలికత్తె అయిన నెరిస్సా అనే కన్యకూకూడా పెళ్ళి కుదిరింది. నెరిస్సా కూడా తన ప్రియుడికి ఒక ఉంగరం ఇచ్చి దాన్ని ఇంకెవరికీ ఇవ్వనని అతనిచేత ప్రతిజ్ఞ చేయించుకున్నది.

రెండు వివాహాలూ జరగబోయే సమ యంలో వెనిస్ నుంచి దారుణవార్త వచ్చింది. ఆంటోనియో వద్దనుంచి మనిషివచ్చి బసా నియోకు ఒక ఉత్తరం ఇచ్చాడు. ఆ ఉత్త రంలో ఇలా ఉన్నది:

"ప్రియమైన బసానియో, నా నౌకలన్నీ సముద్రంలో మునిగిపోయాయి. నేను వడ్డీ వ్యాపారికి పత్రంలో రాసి ఇచ్చిన గడువు దాటిపోయింది. నేను నా బాకీ తీర్చటానికి ప్రాణాలు వదలక తప్పదు. చివరి క్షణాలలో నీవు నా పక్కన ఉండాలని నా కోరిక.

అయినా దీన్ని నిర్బంధంగా భావించకు. నీ భార్య అనుమతించినట్టయితేనే బయలుదేరు."

ఈ ఉత్తరం చదివి బసానియో తెల్ల బోవటం చూసి అతని ఆప్తులెవరో మర ణించారని పోర్షియా భయపడింది. అంటో నియో రాసిన ఉత్తరం చదివాక ఆమె బసానియోతో, "ఒక్క క్షణంకూడా ఆలస్యం చేయక మీ స్నేహితుడి వద్దకు వెళ్లండి," అన్నది.

ఆమె అప్పటికప్పుడే పురోహితుణ్ణి పిలి పించి తమ వివాహం జరిపించింది. అలా చేస్తే గాని పోర్షియా ఆస్తిపై బసానియోకు హక్కు ఏర్పడదు. పోర్షియా బసానియోలతో బాటే నెరిస్సా గ్రాషియానోలుకూడా పెళ్ళా డేశారు. పెళ్ళితంతు ముగియగానే బసా నియో తన వయస్యుడితోసహా వెనిస్ నగ రానికి వెళ్ళాడు.

అంటోనియోను ఖైదులో ఉంచారు. మర్నాడే వెనిస్‌రాజుగారి సమక్షాన విచా రణ జరగనున్నది. బసానియో షైలాక్ వద్దకు వెళ్ళి అంటోనియో బాకీ తాను తీర్చుతానన్నాడు. "గడువు ఏనాడో దాటి పోయింది. నాకు డబ్బు అక్కర్లేదు," అన్నాడు షైలాక్.




బసానియో వెళ్ళిపోయాక పోర్షియా చేతులు కట్టుకు కూచోలేదు. ఆమె ఎలా గైనా అంటోనియోను కాపాడాలని తీర్మా నించుకున్నది. వెనిస్ నగరంలో ఆమె బంధువొకాయన న్యాయవాదిగా ఉంటు న్నాడు. ఆయన పేరు బెలారియో. పోర్షియా తన చెలికత్తెతోసహా బెలారియోవద్దకు వెళ్లి ఆయనకు అంటోనియో వ్యవహారమంతా చెప్పి సలహా కోరింది. బెలారియో ఆమెకు ఏం చెయ్యాలో చెప్పాడు.

తరవాత పోర్షియా న్యాయవాది దుస్తులు ధరించి మగవేషం వేసుకుని తన చెలికత్తెకు తన గుమాస్తా వేషం వేసింది. ఇద్దరూ

కలిసి ఆంటోనియో విచారణకు న్యాయ స్థానంలో హాజరయారు. బెలారియో వద్ద నుంచి ఆమె వెనిస్ ప్రభువుకొక ఉత్తరం తెచ్చింది. తాను ఆంటోనియో తరఫున వాదించదలిచాననీ, తనకు అనారోగ్యంగా ఉండటంచేత తన తరఫున మరొక యువక న్యాయవాదిని పంపుతున్నాననీ బెలారియో రాశాడు. ఇందుకు ప్రభువు సమ్మతించాడు.

విచారణ ప్రారంభమయింది. బసానియో అక్కడే ఉన్నాడు. కాని న్యాయవాది వేషంలో ఉన్న తన భార్యను గుర్తించలేదు. పోర్షియా లేచి షైలాక్‌తో, "ఆంటోనియో నీకు రాసిన పత్రం ప్రకారం అతని శరీరం కోసి పరిహారం పుచ్చుకునే హక్కున్నది. కాని అది సజ్జనులు చేసేపనికాదు. రాజాధి రాజులుకూడా కారుణ్యం లేనివారైతే రాణించరు. అందుచేత ఆ పరిహారంకోసం పట్టుబట్టకు. నీకు రావలసిన సొమ్ముకు రెట్టింపు పుచ్చుకో, మూడురెట్లు పుచ్చుకో!" అని నయాన బోధించింది.

"ఈ పత్రం అక్షరాలా అమలు జరగటమే నేను కోరే న్యాయం," అన్నాడు షైలాక్ మొండిగా.

"నీకు న్యాయమే కావలిస్తే నీ శేరు మాంసం నువు పుచ్చుకో. ఆంటోనియో శరీరంలో ఏ భాగంనుంచి అయినా శేరు



మాంసం తీసుకునే హక్కు నీ కీపత్రం ఇస్తున్నది!" అన్నది పోర్షియా.

షైలాక్ ఆనందపరవశుడై పోర్షియాను భట్రాజులాగా పొగడుతూ కత్తి తీసి దానికి పదును పెట్టసాగాడు. ఆంటోనియో తన అవసానకాలం సమీపించిందనుకుని బసానియోకు వీడ్కోలు చెప్పి, "నీ మూలంగా నేను పోతున్నానని విచారించకు. నేను నిన్ను ఎంతగా ప్రేమించానో నీ భార్యకు చెప్పు!" అన్నాడు.

షైలాక్ ఆంటోనియోపై పగ తీర్చుకోవటానికి తొందరపడుతున్నాడు. "శేరు మాంసం తూచటానికి త్రాసు సిద్ధంగా ఉన్నదా? పాపం, ఆంటోనియో రక్తస్రావంతో మరణించకుండా వైద్యుణ్ణి పిలిపించు!" అన్నది పోర్షియా.

"ఆ సంగతి ఈ పత్రంలో లేదే?" అన్నాడు షైలాక్.

ఆంటోనియో రక్తస్రావంతో చావాలనే వాడి ఉద్దేశం.

"సరే అయితే నీ శేరు మాంసం నువు తీసుకో, దానికి న్యాయం సమ్మతిస్తుంది. ఈ న్యాయస్థానం అభ్యంతరం చెప్పబోదు," అన్నది పోర్షియా.

షైలాక్ పరమానందంతో కత్తి తీసుకుని ఆంటోనియోను సమీపించాడు.





"ఒక్క క్షణం ఆగు. ఇదికూడా గమనించు. ఈ పత్రం ప్రకారం నువ్వు శేరు మాంసం తీసుకోవచ్చునేగాని అంటోనియో రక్తం ఒక్క బొట్టుకూడా తీసుకునే హక్కు లేదు. ఈ పత్రంలో రక్తం ప్రస్తావనే లేదు. మాంసం తీసుకోవటంలో అంటోనియో రక్తం ఒక్క చుక్క నేల పడిందా నీవు హత్యా నేరానికి గురి అయి, నీ ఆస్తి యావత్తూ పోగొట్టుకుని తగిన శిక్ష పొందుతావు!" అన్నది పోర్షియా.

షైలాక్ నిర్ఘాంతపోయి నిలబడ్డాడు. న్యాయస్థానంలో అందరూ హర్షధ్వానాలు చేశారు. షైలాక్ తాను తవ్వుకున్న గోతిలో తానే పడ్డాడు. అంటోనియో రక్తం రాల్చకుండా శేరు మాంసం కాదుగదా చిన్నమెత్తు మాంసం తీసుకోవటంకూడా షైలాక్‌కు సాధ్యం కాదు.

"పోనీ నా డబ్బు నా కిప్పించండి!" అన్నాడు షైలాక్.

"ఈ క్షణం ఇస్తాను!" అని బసానియో ఆనందంతో అరిచాడు.

"అలా కుదరదు. ఫిర్యాది తనకు పరిహారమే కావాలన్నాడు, అతనికి న్యాయస్థానంవారు పరిహారమే ఇప్పిస్తారు. షైలాక్ నీ శేరు మాంసం నువ్వు తీసుకో. సరిగా శేరే తీసుకోవాలి సుమా. ఒక గురిగింజ ఎత్తు అటూ ఇటూ అయితే నువ్వు తీవ్రమైన శిక్షకు గురి అవుతావు!" అన్నది పోర్షియా.

షైలాక్‌పైన అందరికీ గల అసహ్యం ఆ న్యాయస్థానంలో బయటపడింది. షైలాక్ అవమానం పొంది, ప్రాణాలతో ఆ న్యాయస్థానం నుంచి బయటపడ్డాడు. అంటోనియోను వదిలిపెట్టారు. వెనిస్ ప్రభువు పోర్షియా సామర్థ్యాన్ని మెచ్చుకుని తన అతిథిగా ఆహ్వానించాడు. కాని ఆమె తనకు తొందర పని ఉన్నది, వెళ్లాలని బొంకి ఆ ఆహ్వానాన్ని తప్పించుకున్నది. తన మిత్రుడి ప్రాణాన్ని అంత తెలివిగా కాపాడిన

న్యాయవాదికి బసానియో డబ్బు ఇవ్వ బోయాడు. కాని పోర్షియా డబ్బు నిరాకరించి బసానియో చేతిన గల ఉంగరం— తానే ఇచ్చినది—ఇవ్వమనీ, జ్ఞాపక చిహ్నంగా ఉంచుకుంటాననీ అన్నది. తన భార్యకు అపచారం అవుతుందని తెలిసి కూడా బసానియో ఆ ఉంగరాన్ని నిరాకరించ లేకపోయాడు.

అదేవిధంగా, గుమాస్తా వేషంలో ఉన్న నెరిస్సా తన భర్తవద్ద నుంచి తన ఉంగరాన్నే బహుమానంగా పుచ్చుకున్నది.

తరవాత పోర్షియా, నెరిస్సా బెల్మాంట్‌కు వచ్చి తమ ఇల్లు చేరుకుని, మామూలు దుస్తులు ధరించి తమ భర్తల రాకకోసం ఎదురు చూడసాగారు.

కొద్దిసేపటిలోనే బసానియో అంటోనియోనూ, గ్రాషియానోనూ వెంటబెట్టుకుని వచ్చాడు. అతను తన మిత్రుణ్ణి పోర్షియాకు పరిచయంచేసి, న్యాయస్థానంలో జరిగిన సంఘటనలేవీ ఆమెకు తెలియవనుకుని చెప్పసాగాడు.

ఈలోపుగా నెరిస్సా గ్రాషియానోతో పోట్లాటపెట్టుకుని, "నా ఉంగరం ఎవతెకిచ్చావు, చెప్పు!" అని గద్దించసాగింది.

పోర్షియా, "ఏమిటగ్రా, కీచులాడుకుంటున్నారు?" అని అడిగింది.



"ముష్టి ఉంగరంకోసం నన్ను చూడండి, ఎలా సాధిస్తున్నదో!" అన్నాడు గ్రాషియానో.

"అది ముష్టి ఉంగరమా? దాన్ని ఎవరికీ ఇవ్వనని ఈ ఉదయమేగదా ప్రమాణం చేశావు!" అన్నది నెరిస్సా.

"ఆంటోనియోను కాపాడిన న్యాయవాది వెంట ఉండే గుమాస్తా అదే కావాలని పట్టుబడితే ఇచ్చాను. తప్పా?" అన్నాడు గ్రాషియానో.

"అవును, తప్పే. నేను నా భర్తకు ఉంగరం ఇచ్చాను. దాన్ని ఆయన ఎటువంటి పరిస్థితిలోనూ ఇంకొకరికి ఇవ్వరు. కావలిస్తే ఆయనను అడుగు!" అన్నది పోర్షియా గ్రాషియానోతో.

"ఇంకా నయం! ఆయనకూడా మీ ఉంగరాన్ని ఆ న్యాయవాదికిచ్చారు. కావలిస్తే మీరే అడగండి!" అన్నాడు గ్రాషియానో. ఈ సంగతి వింటూనే పోర్షియా బసానియో పైన ఆగ్రహం నటిస్తూ సూటిపోటీమాటలనటం ప్రారంభించింది. ఇదంతా చూస్తూ ఆంటోనియో, "అయ్యో, నేనెంత పాపిష్టిని! నా మూలంగా కదా మీరిలా పోట్లాడుకుంటున్నారు!" అన్నాడు.

"ఇంకొకసారి అయినా అలాటి పని చెయ్యవద్దని మీమిత్రుణ్ణి హెచ్చరించండి—అయినదేదో అయింది!" అంటూ పోర్షియా తన ఉంగరాన్ని ఆంటోనియోకిచ్చింది.

ఆ ఉంగరాన్ని బసానియో తీసుకుని చూసి నిర్ఘాంతపోయాడు. తరవాత పోర్షియా నిజం చెప్పేసింది. ఆంటోనియో తరఫున వాదించిన న్యాయవాది పోర్షియాయేనని తెలిసి ఆంటోనియో, బసానియో చాలా ఆశ్చర్యపడ్డారు. ఆ ఆనంద తరుణంలో మరొక శుభవార్తకూడా వచ్చింది. సముద్రంలో మునిగి పోయాయనుకున్న ఆంటోనియో నౌకలన్నీ సరుకుతో రేవులో వచ్చి దిగాయి.





# లబ్ధ ప్రణాశం

మొసలి :

నా వీపుపై నెక్కు - నా చెలికాడ!
ఈ వార్ధి నీదుచు - నేగెద నటకు
మీ చిన్ని వదిన భీ-ష్మించుక యుండె
లేచి రమ్మిప్పుడే - లేడినై పోదు.

* * *

సరి యని కోతి వృ-క్షము దిగి వచ్చి
అరిగెను మొసలిపై - నధివసియించి
చరచర నీటిలో - నరుగుచు మొసలి
దరి దూరమైన సం-బర మందె లోన
చిక్కెను కోతి నా - చేతులలోన
దిక్కులే దిక వెను-తిరిగి పోలేదు.
నిక్కమ్ము చెప్పిన - నిక భయమేమి?
ఇక్కథ చెప్పియే - యేగెదగాక.
అనుకొని మొసలి మి-త్రునితోడ చెప్పె
తన సతి వాని గుం-డెను కోరెననుచు.
కోతి, ఆ మాట లో-కొక్కక్కటి బాకు
రీతి నాటగ, లోన-నే తలపోసె,
"ఓరి దుర్మార్గుడా - ఓరి నీచుండ
ఈ రీతి ద్రోహమ్ము - నెంచి తెచ్చితివ!"
అని విచారించి వీ-నినిగూడ నిల్లె
తను మోసగించుటే - తగవంచు నెంచె.

కోతి :

అయ్యయో, అక్కడే - అనకపోయితివ?
తియ్యని నా గుండె - తెచ్చియేయుందు.
చెట్టుపై నా గుండె - పెట్టి ఉంచితిని
ఏట్టులిప్పుడు వృథా - యిటు పోవుటెల్ల?

మొసలి :

అటులైన నెటులోయి - అది లేకయున్న
అటుపోయి తిట్లు తి-నుట యౌను నాకు.

కోతి :

దానికేమున్నది - తడయుక తిరిగి
మానిచెంతకు పోయి - మగుడి రావచ్చు.
పదపద వెంటనే - పద చెట్టుకడకు
పదిలమ్ముగా గుండె - పట్టుకవత్తు

* * *

విద్వాన్ విశ్వం



ఆ మాట నిజమని - ఆ మకరమ్ము
ఏ మాట అనక స-రే అని తిరిగె
తీరమ్ముదఱి చెట్టు - చేరువ కేగ
భారము తీరెనం - చారసి కోతి
చెట్టుపైకెక్కి ని-శ్చింత గూర్చుండె.
ఎట్టు రాకున్న వ-చించె నా మొసలి

మొసలి :

చెచ్చెఱ గుండెను - చేకొని రమ్ము
వచ్చి ప్రొద్దాయె నా-వనిత దండించు.

కోతి :

పోవోయి మూర్ఖుడా - పొలతి చెంగటకె
ఈవంక నిక రాకు - మిదియె హెచ్చరిక
సావాసివని నమ్మి - చనవు సూపంగ
నీవింత ద్రోహమ్ము - నెంచితే పాపి ?
ఆడమాటలు విని - ఆప్తుని జంప
నోడక వచ్చిన-వాడవో రోరి !
తగినట్లు బుద్ధి చె-ప్పగ నెంచి అంటి ;
నగుదురు, గుండెను - తిగిచి దాచుదురె ?

*　　　*　　　*

ఆ మాట విని మోస - మయ్యెనే అంచు
ఆ మొసలియు నొక్క - టని చూతమనుచు

మొసలి :

రావోయి మిత్రమా - రమ్ము మా గృహము
పావనమ్మొనరింపు - పరమమిత్రుడను.
నవ్వుటాలకు చెప్పి-నా నంతె కాని
పువ్వుల బూజించు - పొలతి, రారమ్ము.

కోతి :

నమ్మను నమ్మను - సుమ్ము నీ మాట
కిమ్మనకుండ పో-పొమ్ము, రాకెపుడు.
ఆకలి గొని తిన - నాశించువారి
నేకరణిని విశ్వ-సింప రాదంద్రు.

మొసలి :

అదియెట్టులోయి నీ - వన్న దెట్లగును ?

కోతి :

అది యంతియే చెప్ప-నా ? కథ కలదు.
కలదొక్క బావిని - కప్పల రాజు.
కలగె దాయాదుల - కార్పణ్యబుద్ధి.

వారిని రూపు మా - పంగ తలంచి
చేరువ పుట్టలో - చేరిన పాము
కనుగొని దానితో - కడుమైత్రి నెఱపి
తనతోడ రమ్మని - తడయక పిలిచె.
"కడుపార భుజియింప - కప్పలు గలవు
తడయక రమ్మోయి - విడక చూపింతు"
అని, పాము దనవెంట - గొని, బావి కరిగె,
తన శత్రులను చూపి - తప్పకయుండె.
సంతసమ్మున పాము - బొంతకప్పలను
సొంతమ్ము దినివైచె - నట కొన్నినాళ్ళ.
తన వైరులను పాము - ధ్వంసమ్ము చేసె
నని కప్పరాజు స్నే-హమ్ముతో నుండె
కొన్నాళ్ళ కవియెల్ల - సన్నమైపోవ
అ న్నాగుబామున - కాకలి హెచ్చె.
"ఏమోయి నీ శత్రు - లెల్ల పాడయిరి
నా మాట యేమింక? - నా కడుపెట్లు?"
అని పాము, కప్పరా-జును నిలవేసె.
తనవారిలో అల్పు-లను తినుమంచు
కప్పరాజనె కొంత - కాలమ్ము జరిగె.
కప్పలు తనవెల్ల - కడతేరిపోయె
'పగవారికోసమీ - పగవాని జేరి
పగ తెచ్చుకొంటి నా-వా రెల్ల చనిరి'
అని కప్పరాజు 'నీ - కాహారముగను



చని కప్పలను దెత్తు' - నని పాము కేవొ
వినిపించి బ్రదికియుం-డిన శుభమ్ములను
గొనవచ్చునని కప్ప - యవనీశు డరిగె.
ఎన్నాళ్ళ కది రాక-నేపోవ పాము
చిన్నతొండను జేరి - చెప్పి పంపించె.
చని తొండ కప్పరా-జును పిల్చినంత
అనె వాడు: 'ఆకలై - అవయు నా పాము,
వాని చెంతకు నమ్మి - వచ్చుట తగదు.
నేనిటె ఎక్కడో - నివసింతులెమ్ము'

* * *

కోతి:
కావున నే రాను - కదలిపొమ్మింక
నీవేడ నేస్తువు? - నేనేడ పామ్ము.



మొసలి :

అటులన్న నెట్లోయి - ఆప్త మిత్రుడవు
ఎటులైన మా యింటి - కేతేరవలయు.

కోతి :

కల దపాయమటంచు - తెలిసి, రమ్మన్న
తెలివిమాలిన గాడి-దలు విన్న వినును
నీమాట నేనెట్లు - నిజ మనగలను ?
నీ మానమున పామ్ము - నేనింక రాను!

మొసలి :

గాడిద కథ యేమి ? - వేడుకయ్యెడిని.

కోతి చెప్పిన కథ :

వాడిమి గల సింహ-వల్లభుడుండె
వాని పాదము కుంటు-వడె నొకసారి
వానికి మంత్రిగా - పఱలును నక్క.
అందులో అది వేట - ఆడలేకుండె
ఎందున ఆహార-మే చిక్కదయ్యె.
నక్క మంత్రికికూడ - చిక్కదు తిండి
ఎక్కడి కర్మరా - ఇది అని నక్క.
'కదలలేకుంటివి-కద రాజ నీవు
పదిలమ్ము చెడియె నే:పగిది జీవింప'
అని సింహమును జీరి - అన్న నారాజు
'చని దేనినైన ఈ - చాయకు తెమ్ము
పరిమార్తు నప్పుడు - తిరుగంగ లేను'
సరి అని ఆ నక్క - చనె ఊరికడకు
అట నొక గాడిద - అటనట గఱిక
పటపట కొఱుకుచు - పడియున్న చూచి,

నక్క :

ఏమి మామా కృశి-యించి పోయితివి ?
మామూలుగా లేవు - మఱి హేతువేమి ?

గాడిద :

ఏమందు నల్లుడా - యిట తిండి లేదు
కామందు చాకలి - కడు లోభిసుమ్ము.

నక్క :

అయ్యయ్యో, ఈ బాధ - లవియేల నీకు
చయ్యన రమ్ము ప-చ్చని అడవులకు

గాడిద :

వనమృగమ్ములు నన్ను - పని పట్టగలవు
తినకున్న మానె ఊ-రనె ఉండిపోదు.

# దారిన పోయే పెళ్ళికొడుకు

వినుగుచెందని విక్రమార్కుడు తిరిగి చెట్టు వద్దకు వెళ్ళి, చెట్టుపైనుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే శ్మశానంకేసి బయలుదేరాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, ఒక భిక్షువు అడిగినంత మాత్రాన నీవు ఇంత శ్రమపడుతున్నావే, నీ నిరహంకారాన్ని ఏమనవచ్చు! ఎందు చేతనంటే క్షత్రియులు సహజంగా జాత్యహంకారంతో నిండి ఉంటారు. ఇందుకు మంచి నిదర్శనం దుర్జయుడి భార్య జాంబవతి. జాంబవతి కుమార్తె అయిన మధురికకు అతి విచిత్రంగా వివాహం జరిగింది. ఆ వృత్తాంతం చెబుతాను విను," అంటూ ఈ విధంగా చెప్పాడు:

పూర్వం కళింగులకూ చాళుక్యులకూ ఘోరమైన యుద్ధం జరిగింది. ఆ యుద్ధంలో ఉభయపక్షాలా గొప్ప యోధులెందరో చని పోయారు, కాని విజయం ఏపక్షానికీ లభించ

## బేతాళ కథలు



లేదు. ఉభయదేశాలమధ్యా ద్వేషాలు మాత్రమే పెరిగాయి. ఆ యుద్ధంలో చనిపోయిన చాళుక్య వీరులలో దుర్జయుడనే ఆయన ఒకడు. ఆయన రాజవంశానికి చెందినవాడు. అయితే చాలా తరాల క్రితమే రాజరికం పోవటంచేత ఆయన ఒక ఘరానా పౌరుడుగా మాత్రమే జీవించాడు. గోదావరీ తీరాన అరణ్యం మధ్య ఒక పెద్ద భవంతి కట్టుకుని అందులో తన పరివారంతో జీవిస్తూ ఉండేవాడు. ఆయనకూ ఆయన కుటుంబానికీ ఇతరులతో అటే సంబంధాలు లేవు. చింత చచ్చినా పులుసు చావనట్టు వారిలో పూర్వపు రాజసమూ, అహంకారమూ



చావకుండా మిగిలి ఉన్నాయి. దుర్జయుడు యుద్ధంలో మరణించిన అనంతరం ఆయన భార్య ఎంతో నేర్పుతో తన సంసారాన్ని నడుపుకుంటూ వచ్చింది. ఆమెకు మధురిక ఒక్కతే కుమార్తె.

దుర్జయుడి వంశానికి ఒక శాపం ఉన్నది: ఆ వంశంలో పుట్టిన ఆడపిల్లలకు పద్దెనిమిదో యేడు నిండే లోపుగా పెళ్ళిచేసి తీరాలి; లేని పక్షంలో పంథొమ్మిదవ జన్మదినంనాడు వారు చనిపోతారు. గడచిన అయిదారు తరాలలోనూ ఇద్దరు కన్యలు అలా చనిపోయారు. సమయంలో వారికి తగిన సంబంధాలు కుదరకనే వారు చనిపోవటం జరిగింది.

మధురికకు పద్దెనిమిదవ ఏడు జరుగుతున్నది. కాని ఆమెకు శాపభయం లేదు. ఎందుచేతనంటే ఆమెను పెళ్ళాడేవాడు అదివరకే నిశ్చయమై ఉన్నాడు. అతని పేరు విరూపాక్షుడు. అతనికి ముప్పై సంవత్సరాల వయసు. చాలా ధైర్యసాహసాలూ, బలపరాక్రమాలూ కలవాడు. దుర్జయుడిలాగే రాజవంశానికి చెందినవాడు. మధురిక చూడటానికి ఎంత నాజూకుగా ఉండేదో అతను అంత మొరటుగా ఉండేవాడు. అయినా అతనికి చిన్నతనంనుంచీ మధురిక అంటే ప్రాణం; ఆమెకోసం తన





ప్రాణాలు విడవటానికైనా ఎల్లప్పుడూ సంసిద్ధుడుగా ఉండేవాడు.

జాంబవతి దృష్టిలో విరూపాక్షుడు తన కుమార్తెకు అన్నివిధాలా తగిన భర్త. ఎందు చేతనంటే కులంలోనూ, గుణంలోనూ అత నికి సాటి ఎవరూ లేరు. పైపెచ్చు, అతను దుర్జయుడి కుటుంబానికి మగదిక్కుగా ఉండి, జాంబవతి అధికారానికి ఎటువంటి అడ్డూలేకుండా చూసుకుంటూ వస్తున్నాడు.

మధురికకుమాత్రం చిన్నతనంనుంచీ విరూపాక్షుడంటే ఏదో భయం. అతను దగ్గిరికి వస్తే పక్కకు చూసేది, అతని గొంతు వింటే ఉరుము విన్నట్టు వణికేది. అతను ఎంతో ఆప్యాయంగా తనను కుశల ప్రశ్న అడిగినా, సమాధానం చెప్పటానికి కంగారు పడేది. ఇంత అయినా, తల్లి నిత్యమూ చేసే బోధలు విని తనకు విరూపాక్షుడి కన్న తగిన భర్తలేడని ఆ అమాయకురాలు మనస్ఫూర్తిగా నమ్మింది.

రేపు మధురికకు పద్దెనిమిది వెళ్లి పంథొమ్మిది వస్తుందనగా ఆమె వివాహం జరపటానికి ఏర్పాట్లు చేశారు. రాత్రి రెండవ జాములో ముహూర్తం. మధురికను పెళ్ళి కూతుర్ని చేశారు. ఇల్లంతా అలంకరించారు. పెళ్ళివారికోసం ఎదురుచూస్తున్నారు.



అనుకున్న ప్రకారం సూర్యాస్తమయం లోపల పెళ్లివారు రాలేదు. జాంబవతి ఆందోళన చెందసాగింది. బాగా చీకటి పడి నాక విరూపాక్షుణ్ణి గురించి కబురు తెలిసింది. అతను పెళ్లికి బయలుదేరబోతూండగా ఎవరో శత్రువు తటస్థపడ్డాడు. ఇద్దరికీ కత్తి యుద్ధం జరిగింది. ఆ యుద్ధంలో దెబ్బతిని విరూపాక్షుడు చనిపోయాడు.

ఈ దుర్వార్త వినగానే జాంబవతికి మిన్ను విరిగి మీదపడినట్టయింది. ఇంకొక సమయంలో అయితే ఆమె విరూపాక్షుడి చావుకు ఎంతో విచారించి ఉండును. ఇప్పు డామెకు అందుకుకూడా వ్యవధిలేదు. మరి

రెండుమూడు గడియలలో మధురికకు పెళ్లి కాకపోతే రేపు ఉదయంలోపల ఆమె చావు నిశ్చయం!

ఈ ఆపదనుంచి బయటపడటానికి ఆమెకు ఒకటే ఉపాయం తోచింది. ఎవరైనా దారేవెళ్ళేవాణ్ణి పట్టుకుని, ముహూర్తం దాటకుండా మధురికను అతనికిచ్చి పెళ్లి చెయ్యాలి. మిగిలినదంతా దైవాధీనం.

జాంబవతి తన వదినెగారిని పిలిచి, "వదినా, నువు చాలా సమర్థురాలవు, సూక్ష్మబుద్ధిగలదానివి, పెద్దదానివి. గుర్తు తెలియకుండా నల్లగొంగళీ కప్పుకుని రహదారి పక్కన నిలబడి దారేపోయే యువకుణ్ణి, మన పిల్లకు కొంతలో కొంత తగి ఉండే వాడుగా చూసి, ఏమీ చెప్పకుండా తీసుకు రావాలి. లేకపోతే అమ్మాయి మనకు దక్కదు!" అన్నది.

ఈ వృద్ధురాలు దుర్జయుడి అక్కగారు, చాలా సమర్థురాలుకూడా. ఆమె కొంచెం కూడా సంకోచించక ఆ చీకటిలో అడవి మధ్యగా నడిచి కొద్దిదూరంలో ఉన్న రహదారి చేరుకున్నది. అప్పుడే చంద్రోదయం కూడా అయింది.

ఆమె దారి పక్కన చాలాసేపు నిలబడింది. కాని ఎవరూ అటుగా రాలేదు. ఎవరూ రారేమో మధురికకు బతికే గీత





లేదేమో అనుకుంటుండగా దూరాన గుర్రపు డెక్కల ధ్వని వినపడింది. కొంతసేపటికి ఒక యువకుడు గుర్రంమీద సవారీ అయి వస్తూ కనిపించాడు.

ఆ వెన్నెలలో అంత దూరాన చూసే వృద్ధురాలు, ఆ వచ్చే యువకుడి వయసు పాతికేళ్లు దాటదనీ, అతను గొప్ప వంశానికి చెందినవాడనీ, అందంలో మధురికకు తీసి పోడనీ తెలుసుకున్నది. అతన్ని ఆపటానికి ఆమె దారికి అడ్డంగా వచ్చి నిలబడింది.

గుర్రంపైన వచ్చే ఆ యువకుడి పేరు కాంతివర్మ. అతను కళింగదేశపువాడు. అతనుకూడా పెళ్లికొడుకే. అతనికి పెద్ద ఆస్తి ఉన్నది. చాలా రోజులుగా పెళ్లి ప్రయత్నాలు చేశాడు. కాని అతనికి నచ్చినపిల్ల ఎక్కడా కనబడలేదు. ఎవతెనో ఒకతెను కట్టుకుని గృహస్థు అవుదామనే ఉద్దేశంతో కృష్ణాతీరానికి బయలుదేరాడు. అక్కడ అతని తండ్రికి స్నేహితుడొకాయన ఉన్నాడు. ఆయన కుమార్తెను చేసుకుందామని కాంతివర్మ ఉద్దేశం. ఆ పిల్లపై అతనికి ప్రేమ లేదు. కాని ప్రేమించకుండా పెళ్ళాడ దలచినాక ఎవరైనా ఒకటే అని అతను అనుకున్నాడు.

తన దారికి అడ్డం వచ్చిన ఆకారాన్ని చూసి కాంతివర్మ కళ్లెం బిగలాగి తన





గుర్రాన్ని ఆపాడు. వృద్ధురాలు సమీపించి అతనితో, "దేవుడే నిన్ను పంపాడు. నావెంట వస్తావా, బాబూ ?" అన్నది.

ఆమె స్త్రీ అనీ, అందులోనూ వృద్ధురాలనీ తెలిసి ఆశ్చర్యపడుతూ కాంతివర్మ, "ఎక్కడికి ? ఏం పనిమీద?" అని అడిగాడు.

"అదంతా చెప్పటానికి పుణ్యకాలం మించిపోతుంది. పిరికివాడివి కాకపోతే నావెంట రా. నీకు అశుభం జరగదులే!" అంటూ వృద్ధురాలు అడవిలోనుంచి దారి తీసింది. కాంతివర్మకు ఏమాత్రమూ భయం కలగలేదు, పైపెచ్చు ఆసక్తి కలిగింది. తనకు తలవని తలంపుగా ఏదో కొత్త అనుభవం జరగబోతున్నది. అతను గుర్రం దిగి, వృద్ధురాలి వెనకనే వెళ్ళాడు.

ఇద్దరూ కొద్దిసేపట్లో ఇల్లు చేరారు. ఇల్లంతా అలంకరించి ఉండటం చూసి ఏదో పెళ్ళో పేరంటమో జరగబోతున్నదనుకున్నాడు కాంతివర్మ.

జాంబవతి అతన్ని పరిశీలించి, "ఫరవాలేదు. ఈమాత్రం మనిషి దొరుకుతాడని నేననుకోలేదు," అన్నది.

కాంతివర్మకు కొద్దిగా చిరాకు కలిగింది. "నాతో ఏం పనో మీలో ఎవరూ చెప్పారు కారు," అన్నాడు.

"నాయనా, నాకు ఒకే ఒక కూతురు. అది తెల్లవారితే బతకదు! నేను ఎలాటి చిక్కులో ఉండి నిన్ను పిలిపించానో ఆలోచించు. నా పిల్లను చూస్తే, నా బాధను మరింత బాగా అర్థం చేసుకుంటావు!" అన్నది జాంబవతి.

కాంతివర్మకు అంతా అయోమయంగా ఉంది. అతను జాంబవతి వెంట లోపలికి వెళ్ళి దీపాల కాంతిలో మిలామిలా మెరిసిపోతున్న మధురికను చూశాడు. అతను అంత అందగత్తెను ఎన్నడూ ఊహించి కూడా ఉండలేదు. ఆమె దేవతా స్త్రీలాగా కనబడింది.



"ఆ పిల్లేనా ?" అన్నాడు కాంతివర్మ.

"అవును, నాయనా! అది రేపీపాటికి శవం అవుతుందంటే నా ప్రాణం ఎలా కొట్టుకుపోతున్నతో ఆలోచించు!" అన్నది జాంబవతి.

ఆమెకేమి జబ్బని అడుగుదామనుకునే టంతలో మధురిక అతని వేపు చూసింది. మరుక్షణం ఆమె చెక్కిళ్లు ఎర్రబడ్డాయి, ఆమె కళ్ళలోకి వింత వెలుగు వచ్చింది. బుద్ధి తెలిసినది మొదలు ఆమె తనకు కాబోయే భర్తను విరూపాక్షుడి రూపంలో మాత్రమే ఊహించుకున్నది. అతను చని పోయి తనకు దారేపోయే భర్తను కట్టిపెడ తారని తెలిశాక, అంతకంటెకూడా హీనుడే వస్తాడనుకున్నది. అందుచేత, యువకుడూ అందగాడూ అయిన కాంతివర్మ ఆమె కళ్ళకు సాక్షాత్తూ నవమన్మథుడిలాగా కని పించాడు.

ఎలాగైతేనేం కాంతివర్మా, మధురికా ఒకరినొకరు చూస్తూనే ప్రేమించుకున్నారు. కాంతివర్మ ఇంకా ఎన్నో విషయాలడుగుదా మనుకుంటూ ఉండగా, పురోహితుడు ముందుకు వచ్చి, "జాంబవతీదేవిగారూ, ఆలస్యం చేస్తే ముహూర్తం మించి పోతుంది," అన్నాడు.

"ఇంక నా ఆలస్యమేమీ లేదు, వసిష్ఠు గారూ!" అన్నది జాంబవతి.

మధురికనూ, కాంతివర్మనూ పీటలపై కూచోబెట్టి ఒక్కగడియలో పెళ్లిచేసేశారు. కాంతివర్మ ఆత్మాభిమానం లేని మనిషి కాడు. "ఈ పిల్లను పెళ్ళాడతావా ?" అని అతన్ని ఎవరూ అడగలేదు; సామాన్యపు నౌకరును ఆజ్ఞాపించినట్టు, 'ఈ బట్టలు కట్టుకో! అలా పీటమీద కూచో!' అని ఆజ్ఞా పించారు. కేవలం మధురికపై ఏర్పడిన ప్రేమ కారణంగా ఈ అవమానాలను అతను సహించాడు. మధురిక తనను ప్రేమిస్తున్న దని అతనికి రూఢి అయింది. పెళ్లిపీటల

మీద ఉన్నప్పుడే ఆమె అనేకసార్లు అతని కేసి చూసి, చిరునవ్వు నవ్వి, ఎవరూ చూడకుండా తల వంచుకున్నది.

పెళ్లి అయిపోయాక అందరూ భోజనాలకు కూచున్నారు. అప్పుడు జాంబవతి తన అల్లుడి పుట్టు పూర్వోత్తరాలు విచారించింది. అతను కళింగదేశంవాడని తెలియగానే ఆమెకు కష్టంవేసింది. కాని అతని తండ్రి ధీరవర్మ కళింగులకూ చాళుక్యులకూ జరిగిన యుద్ధంలో కళింగులపక్షాన యుద్ధంలో చేరి పోరాడుతూ చనిపోయాడని తెలియగానే ఆమెకు శివం ఎత్తినట్టయింది.

"ఎంత అన్యాయం! ఎంత దారుణం! నా భర్తను యుద్ధరంగంలో నీ తండ్రి చంపి ఉండవచ్చు. మీ జాతే మాకు శత్రువులు, నువు మాకు గర్భశత్రువువు. పెళ్లి అయితే అయింది; నా బిడ్డ ప్రాణం కాపాడటానికి దారేపోయే దానవుడికైనా ఇచ్చి ఉండేదాన్నే! కాని దాన్ని కాపరానికి పంపను. అది నీతో కాపరం చేసేకన్న చచ్చిపోతేనే నాకు ఎక్కువ సంతోషం! ఈ పెళ్లి ఇంతటితో సరి. త్వరగా భోజనం కానిచ్చి నీ దారిన నువు వేంచెయ్యి!" అన్నది జాంబవతి కాంతివర్మతో.

కాంతివర్మ ఘాటుగా జవాబిచ్చి ఉండేవాడే గాని మధురిక కళ్ళలో నీరు తిరగటం



చూసి సౌమ్యం వహించి, "అత్తగారూ, మీరు చెప్పినదల్లా చేయటం చూసి నన్ను అసమర్థుడనుకున్నారులాగుంది! అలా పార పాటుపడకండి. నేను నా భార్యను తప్పక వెంటబెట్టుకుపోతాను. ఆ విషయం మీకు సందేహంవద్దు!" అన్నాడు.

ఇంతలో అక్కడికి తూలుతూ తూలుతూ ఒక ఒడ్డూపొడుగు మనిషి వచ్చాడు. అతని బట్టలు రక్తంతో తడిసి ఉన్నాయి. అతన్ని చూస్తూనే జాంబవతి, "విరూపా, బతికి ఉన్నావా, నాయనా? ఇంతసేపూ ఏమ యావు! సమయానికి నువు లేకపోవటంచేత నిష్కారణంగా పిల్లగొంతుకోస్తినే!" అంటూ, ఆ వచ్చిన విరూపాక్షుడితో జాంబవతి జరిగిన దంతా చెప్పింది.

విరూపాక్షుడు అంతా విని ఒక్క పెడ బొబ్బ పెట్టి, "దుర్మార్గుడా, నేను పెళ్ళాడ బోయే కన్యను కాజేస్తావా? అంతు తేలు స్తాను, రా!" అంటూ కత్తి దూశాడు.

కాంతివర్మ ఒక్కసారి మధురికకేసి చూసి, ఆమె విరూపాక్షుణ్ణి చూసి భయ పడటం గమనించి తృప్తి పడ్డాడు. అతను విరూపాక్షుడితో, "మీ భాష చాలా వింతగా ఉన్నది. నేను ఎవరినీ కాజెయ్యలేదు. నా అనుమతికూడా పొందకుండా నన్ను దారి తప్పించి తెచ్చి ఈ మధురికను ఇచ్చి చేశారు.





అమెను నేను ప్రేమించాను, అమెకూ నాపైన ప్రేమ ఉన్నదనుకుంటున్నాను. అందుచేత మీరు నన్ను కవ్వించటం ఏమీ సమంజసంగా లేదు," అన్నాడు.

మధురికను పోగొట్టుకున్న విరూపాకుడికి హితం తలకెక్కలేదు. అదివరకు జరిగిన పోరాటంలోనే అతను బాగా దెబ్బతిని రక్తం పోగొట్టుకుని ఉన్నాడు. "ఆ గాయాలు నయమయాక అలాగే నీతో యుద్ధం చేస్తాను," అని కాంతివర్మ అన్నప్పటికీ, విరూపాకుడు మొండిపట్టుబట్టి, "ఈ రాత్రి నువ్వో నేనో చావాలి. మగధీరుడివైతే యుద్ధానికి రా!" అన్నాడు.



"నేను నీతో యుద్ధం చెయ్యను. నన్ను రెచ్చగొట్టలేవు!" అన్నాడు కాంతివర్మ.

ఆ మాట వినగానే జాంబవతి కాంతివర్మను నానామాటలూ అన్నది. కళింగులంతా పిరికిపందలే నన్నది; దుర్జయుడి కడుపున పుట్టిన పిల్ల పిరికి వెధవతో కాపరం చెయ్యదన్నది.

కాంతివర్మ చివరకు అన్నం ముందు నుంచి లేచి కత్తి చేతబట్టుకుని ముందుకు వచ్చాడు. అతనూ విరూపాకుడూ ఇంటికి దూరంగా వెళ్లి తాము పోట్లాడేదానికి స్థలం చూసుకున్నారు. బయట వెన్నెలలో ఇద్దరూ గర్భశత్రువులులాగా నిలబడ్డారు. విరూపాకుడు కత్తి ఎత్తి కాంతివర్మ పైకి లంఘించాడు. కాంతివర్మ తన కత్తిని అడ్డం పెట్టుకుని దెబ్బ కాచుకున్నాడు. ఇలా చాలా సార్లు జరిగాక విరూపాకుడి గాయాలనుంచి మళ్ళీ రక్తం స్రవించసాగింది. అతను స్పృహతప్పి పడిపోయాడు.

అతనికి మళ్ళీ స్పృహ తెలిసేసరికి కాంతివర్మ ముఖం కనిపించింది.

"నన్ను ఎక్కడ పొడిచావు?" అని విరూపాకుడు అడిగాడు.

"నిన్ను నేను ఎక్కడా పొడవలేదు. గాయపడి ఉండటంచేత నీ అంతట నీవే



సొమ్మసిల్లావు. పిరికిపందలుతప్ప వీరుడైన వాడెవడూ గాయపడినవాడితో పోట్లాడడు!" అన్నాడు కాంతివర్మ.

"మధురికను నాకు కాకుండా చేశావన్న ఆవేశంలో మతిపోయి ప్రవర్తించాను. మధురిక నిజంగా నిన్ను ప్రేమిస్తున్నదా?" అని విరూపాక్షుడు అడిగాడు.

"నీకు కళ్ళు లేవా? ఆమె నీకేసి ఎలా చూసిందీ, నాకేసి ఎలా చూసిందీ నువు గమనించలేదా?" అన్నాడు కాంతివర్మ.

విరూపాక్షుడు నిట్టూర్చి, "మధురిక సుఖమే నాకు కావాలి!" అంటూ, కాంతివర్మ సహాయంతో ఇంటికి తిరిగి వచ్చాడు.

వారిద్దరినీ చూసి జాంబవతి పాలిపోయి నట్టయిపోయింది.

"అల్లుడికి జరపవలసిన మర్యాదలన్నీ అయిపోయాయి గనక నా భార్యను తీసుకుని నేను బయలుదేరబోతున్నాను. అడ్డు పెట్టేవారింకెవరైనా ఉన్నారా?" అని కాంతివర్మ జాంబవతిని అడిగాడు.

"అదేమిటి, నాయనా? నూతన వధూవరులు మూడు నిద్రలూ చెయ్యాలి, మనుగుడుపులు జరపాలి, పదహారోరోజు పండగ పూర్తి చెయ్యాలి, అప్పుడూ ఆడపిల్ల అత్తవారింటికి వెళ్లేది!" అన్నది జాంబవతి. తనను గురించి తన అత్తగారు అభి



ప్రాయం మార్చుకున్నదని తెలియగానే కాంతివర్మ సంతోషించాడు.

బేతాళుడీ కథ చెప్పి, "రాజా, నాకొక్క సందేహం. జాంబవతి కాంతివర్మ గురించి తన అభిప్రాయం ఎందుకు మార్చుకున్నది? తనకు కుడిచేయిలాగా ఉంటున్న విరూపాక్షుణ్ణి చంపక విడిచాడన్న కృతజ్ఞతతోనా? లేక విరూపాక్షుడు కాంతివర్మకు మిత్రుడైపోయాక తన పంతం నెగ్గించేవారెవరూ ఉండరన్న భయంతోనా? ఈ ప్రశ్నకు సమాధానం తెలిసికూడా చెప్పకపోయావో నీతల వెయ్యి చెక్కలవుతుంది," అన్నాడు.

"జాంబవతిలో మార్పుకు కారణాలు నీవు చెప్పిన రెండూ కావు. ఆవిడ జాత్యహంకారం చేతనే కాంతివర్మను ద్వేషించింది. విరూపాక్షుడు బతికే ఉన్నాడని తెలియక పూర్వంకూడా ఆమె కాంతివర్మను తన అల్లుడుగా స్వీకరించ నిరాకరించింది. అయితే జాత్యహంకారానికికూడా ఏదో ఒక ఆధారం ఉండాలిగద. జాంబవతి ఉద్దేశంలో కళింగులు చాళుక్యులకు శత్రువులు. కాని కాంతివర్మలో అలాటి శత్రుభావం లేదని రుజువయింది. అతను విరూపాక్షుణ్ణి చంపగలిగి ఉండికూడా విడిచిపుచ్చాడు. అతనిలో చాళుక్యులపట్ల ద్వేషంలేదని రుజువయింది. అంతేగాక కాంతివర్మలో జాత్యహంకారం లేదు. విరూపాక్షుడు కయ్యానికి కాలుదువ్వుతూ అపమానించినప్పటికీ పడిఉండటం చూసి జాంబవతి అతన్ని పిరికివాడి కిందకట్టింది. అతను పిరికివాడు కాడనీ, జాత్యహంకారం లేకపోవటం అతనిలో ఒక సద్గుణమేననీ స్పష్టమయాక జాంబవతి తన జాత్యహంకారాన్ని విడిచిపుచ్చింది. అదే ఆమెలో కలిగిన మార్పు," అని విక్రమార్కుడు జవాబు చెప్పాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతోసహా మాయమై మళ్లీ చెట్టెక్కాడు. —(కల్పితం)






# చూపు ఆనినివాళ్లు

ఒక ఊళ్లో ముగ్గురు అన్నదమ్ములు పక్క పక్క ఇళ్లలో నివసిస్తూండేవాళ్లు. ఆ ముగ్గురికీ అపరిమితమైన చత్వారం; ఏ వస్తువైనా ముక్కుదగ్గిర పెట్టుకుంటేగాని కనిపించేదికాదు.

ఆ అన్నదమ్ములు ముగ్గురూ ఒకనాటి సాయకాలం పెద్దవాడి ఇంట కలుసుకుని లోకాభిరామాయణం మాట్లాడుతున్నారు. మధ్యలో పెద్దవాడు తన తమ్ములతో, "అన్నట్టు, ఈ మధ్య నా చూపు చాలా బాగయింది సుమా. అంతదూరాన దోమ కనిపిస్తే అది ఆడదో మగదో పోల్చగలుగుతున్నాననుకోండి," అన్నాడు.

"చాల్లే నీ బడాయిలు! వారం క్రితమేగా నువు పట్టపగలు కావడివాడిపైన పడిందీ?" అన్నాడు రెండోవాడు.

"పగలు మాట అటుంచు. చీకటిపడిన కొద్దీ అద్భుతంగా చూపు ఆనుతున్నది. కొందరికి రాత్రిచూపు ఉంటుందట," అన్నాడు పెద్దవాడు.

"ఇవన్నీ ఎందుకొచ్చిన కబుర్లు? తింటేగాని రుచి తెలియదు. ఎవరిచూపు ఎటువంటిదో పరీక్ష పెడితే క్షణంలో తేలిపోతుంది," అన్నాడు మూడోవాడు.

"ఏమిటాపరీక్ష?" అన్నాడు రెండోవాడు.

"చెబుతాను వినండి. మన వీధి కెదురుగా సత్రంవాకిలి ఉన్నదే, ఆ వాకిలిపైన రేపు ఉదయం ధర్మశాసనం శిల వేయిస్తున్నారు. ఆ శిలపైన ఏమి చెక్కి ఉన్నదో చదవటమే మనకు పరీక్ష. దానిమీది అక్షరాలను మనలో ఎవరు ఎక్కువ దగ్గిరగా నిలబడి చదవగలిగితే వాడు ఓడినట్టు. మిగిలిన ఇద్దరికీ ఓడినవాడు భోజనం పెట్టేటట్టు పందెం!" అన్నాడు మూడోవాడు.

దీనికి పెద్దవాళ్లిద్దరూ సరే నన్నారు. చిన్నవాళ్లు తమ ఇళ్లకు వెళ్లిపోయాక పెద్దవాడికి

టి. ఎస్. రామారావు



బెంగపట్టుకున్నది. కారణం; ఆ శాసనాన్ని ముక్కుతో తాకిగాని చదవలేడు.

ఈ సమస్యగురించి చాలాసేపు సతమతమైన మీదట పెద్దవాడికి దివ్యమైన ఆలోచన తట్టింది. సత్రంలో గుమాస్తా ఉంటాడు. అయన నడిగితే ఆ ధర్మశాసనం పలకపైన ఏమున్నదీ చెప్పేస్తాడు. ఈ ఆలోచన తట్టగానే పెద్దవాడు బయలుదేరి సత్రానికి వెళ్లాడు.

"ఏదో పనిమీద దయచేశారు?" అన్నాడు సత్రం గుమాస్తా.

"మరేమీలేదు. రేపు ధర్మశిల వేస్తున్నారటగా? దానిమీద ఏమి రాయించారేమిటి?" అన్నాడు పెద్దవాడు.



"ఏమీ లేదండీ, 'శ్రీరామకటాక్షము' అని రాయించారు," అన్నాడు గుమాస్తా.

పెద్దవాడు ఆనందభరితుడై గుమాస్తా వద్ద సెలవుపుచ్చుకుని ఇంటికి బయలుదేరాడు. సత్రంవాకిలి వద్దనే రెండోవాడు పెద్దవాడికి ఎదురువచ్చాడు. అయితే ఇద్దరూ చూపు అననివాళ్లే గనక ఒకరినొకరు గమనించలేదు.

పెద్దవాడికి వచ్చిన ఆలోచనే రెండోవాడికీ వచ్చింది. అయనకూడా గుమాస్తా వద్దకు వెళ్లి పెద్దవాడు అడిగినట్టే, ధర్మశాసనంపైన ఏమి రాయించారని అడిగాడు. ప్రతివాళ్లూ ఇదే సంగతి అడగటంచూసి ఆశ్చర్యపడుతూ గుమాస్తా పెద్దవాడికి చెప్పినట్టే జవాబు చెప్పాడు. రెండోవాడు అంతటితో తృప్తిపడి వెళ్లిపోక, "పలక ఏరంగుది? అక్షరాలు ఏరంగు?" అని అడిగాడు.

"తెల్లటి చలవరాతిపైన బంగారు చెక్కడు అక్షరాలు," అన్నాడు గుమాస్తా.

రెండోవాడు వెళ్లిన కాస్సేపటికి మూడోవాడువచ్చి గుమాస్తాను మొదటివాడు అడిగినట్టే అడిగాడు. గుమాస్తా చెప్పాడు.

"'శ్రీరామ కటాక్షము' అన్నదాని కింద శాసనం వేయించేవారి పేరుగాని చెక్కించలేదా ఏం?" అన్నాడు మూడోవాడు.



"చిన్న అక్షరాలతో 'ఫలానావారు' అని చెక్కించారు. దానికి ఏం రంగు పూశారని అడుగుతారేమో! ఎర్ర రంగు!" అన్నాడు గుమాస్తా నవ్వుతూ.

అన్నదమ్ములు ముగ్గురూ, "నేను గెలిచా!" అనుకుంటే, "నేను గెలిచా!" అనుకుని ఆ రాత్రి నిద్రపోయారు. తెల్లవారగానే పెద్దవాడింటికి మిగిలిన వాళ్లిద్దరూ వచ్చారు. ధర్మశాసనం చూడబోదామని ముగ్గురికీ ఆత్రంగానే ఉంది. అందుచేత ఆటే ఆలస్యం చేయకుండా ముగ్గురూ వీధిలోకి వచ్చారు. పెద్దవాడు చప్పున ఆగి సత్రం కేసిచూసి, "ఇంకా దగ్గిరికి పోవలిసిన అవసరమేముందీ? శాసనం పలకమీది అక్షరాలు ఇక్కడికే కనిపిస్తున్నాయి. చదవనా? 'శ్రీ రామ కటాక్షము'—కొట్టవచ్చినట్టు కనిపిస్తున్నాయి!" అన్నాడు.

ఈ మాటలు విని చిన్నవాళ్లిద్దరూ నిర్ఘాంతపోయారు. ఒక క్షణంపాటు తాము ఓడామని వాళ్లు భయపడ్డారు. కాని రెండోవాడు తెప్పరిల్లుకుని, "పలక ఏరంగుది? అక్షరాలు ఏరంగు?" అని అడిగాడు.

పెద్దవాడికి గోతిలో పడ్డట్టయింది. "రంగా? నీకు రంగు కనిపిస్తున్నదా ఏమిటి?" అన్నాడాయన రెండోవాడితో.



"రంగు కనిపించకపోవటమేమిటి? తెల్లటి పలకమీద బంగారు పూతపూసిన చెక్కుడు అక్షరాలు కనిపించటం లేదూ?" అన్నాడు రెండోవాడు.

"మీ రిద్దరూ ఎందుకు పోట్లాడుకుంటారు. ఆ పలకమీద చెక్కి ఉన్న చిన్న అక్షరాలు చదవగలరేమో చూడండి. పెద్ద అక్షరాలు కబోదికూడా చదువుతుంది," అన్నాడు మూడోవాడు.

"పలకమీద చిన్న అక్షరాలుకూడా ఉన్నాయా?" అన్నారు పెద్దవాళ్లిద్దరూ.

"కనిపిస్తూంటేనే! ఎర్రటి అక్షరాలు, 'ఫలానావారు' అని స్పష్టంగా రాసిఉంది!

ఏమిటో అనుకున్నాను. మీ ఇద్దరి చూపు కంటె నాదే నయమే !" అన్నాడు మూడో వాడు. పెద్దవాడు తానుకూడా గెలిచిన వాడితో చేరే ఉద్దేశంతో, "నీ చూపే మన ముగ్గురి లోకీ మంచిది. తరవాత నా చూపు మంచి దంటాను. పెద్ద అక్షరాలను గుర్తించినది నేనుకద! మీరింకా ముందుకుపోబోతుంటే నేను ఇక్కడే ఆగాను! అందుచేత నీకూ నాకూ రెండోవాడు భోజనం పెట్టాలి," అన్నాడు. రెండోవాడు పేచీపెట్టాడు. అక్ష రాలు ఏ రంగో, పలక ఏరంగో తెలుసుకో లేనివాడు చూశాడంటే ఎలా నమ్మటం?

కాస్సేపు ముగ్గురూ ఘర్షణపడి ఎవరి తీర్పు అయినా తీసుకోవటానికి ఒప్పు కున్నారు. ఇంతలో సత్రం గుమాస్తా అటుగా వచ్చాడు. "అయ్యా, మీరెవరో కాస్త మాకు న్యాయం చెప్పండి. ఆ సత్రం ధర్మశాసనం మీద శ్రీరామ కటాక్షము అని రాసిఉన్న మాట అబద్ధమా?" అని పెద్దవాడు అడిగాడు.

"కాదు!" అన్నాడు గుమాస్తా.

"పలక తెల్ల చలవరాయి అవునంటారా? దానిమీద బంగారు చెక్కుడు అక్షరాలే నంటారా?" అన్నాడు రెండోవాడు.

"అవును!" అన్నాడు గుమాస్తా.

"చిన్న అక్షరాలతో 'ఫలానావారు' అని రాసి ఉన్నమాటా, అక్షరాలు ఎర్రగా ఉన్న మాటా నిజమే నంటారా?" అన్నాడు మూడోవాడు.

"నిజమే!" అన్నాడు పూజారి.

మళ్లీ అన్నదమ్ములు "నా చూపు మెరుగు!" అంటే "నా చూపు మెరుగు!" అని తగాదాపడసాగారు.

సత్రం గుమాస్తా వారిని ఆపి, "మెరుగో తరుగోగాని మీ ముగ్గురి చూపూ ఒకటిగానే ఉన్నదని నా ఉద్దేశం. ఎందుచేతనంటే సత్రం వాకిలికి ఇంకా ధర్మశాసనం పలక తగిలించలేదు!" అంటూ తనదారిన తాను వెళ్లిపోయాడు.






# అహింసాజ్యోతి

సుమారు రెండున్నరవేల సంవత్సరాల క్రితం భారతదేశంలో పదహారు పెద్ద రాజ్యాలూ, అనేక చిల్లర రాజ్యాలూ ఉండేవి; కొన్ని గణతంత్ర రాజ్యాలుకూడా ఉండేవి. పెద్ద రాజ్యాలలో ప్రధానమైనవి కోసల, మగధ, విదేహ రాజ్యాలు. లిచ్ఛవులూ, శాక్యులూ గణతంత్ర రాజ్యాలు ఏర్పరచుకున్నారు. శాక్యుల రాజ్యం హిమాలయాలకు దిగువగా, సుమారు వెయ్యి చదరపుమైళ్లు విస్తీర్ణం కలిగి ఉండేది. శాక్యులు కోసలరాజులకు సామంతులు. కపిలవస్తునగరం వారి రాజధాని. శాక్యుల దేశం చాలా అందమైనది, సారవంతమైనది. దీనికి ఉత్తరాన హిమాలయాల మంచు కొండలుండేవి. దేశమంతటా అందమైన సాలవృక్షాలూ, ఇతర వృక్షాలూ ఉండేవి. మైదానాలలో వరి పుష్కలంగా పండేది.

శాక్యులు క్షత్రియులు. వారికి శుద్ధోదనుడు రాజు. శాక్యులు కోసలరాజుకింద సామంతులే అయినప్పటికీ, ఎక్కువ అభిమానం కలవారు; ఒకరికి సులువుగా తల ఒగ్గేవారుకారు. ఒకప్పుడు ఒక కోసలరాజు తనకు భార్యగా ఉండటానికి ఒక శాక్య కన్యను పంపమని కబురు చేస్తే శాక్యులంతా కూడ బలుక్కుని, తమ కన్యలను వివాహమాడటానికి కోసలరాజులు అర్హులు కారని తీర్మానించి, ఒక బానిసపిల్లను పంపారు! ఇందుమూలంగా కోసలరాజు కపిలవస్తును బుద్ధుడికాలంలోనే కొల్లగొట్టటం జరిగింది. శాక్యులు అలాంటి అభిమానధనులు.



శాక్యరాజైన శుద్ధోదనుడి పట్టమహిషి మహామాయ, లేక మాయాదేవి. ఆయన రెండవ భార్య మహాప్రజాపతి. వీరిద్దరూ వ్యాఘ్రపురరాజు కుమార్తెలు. వీరి గర్భాన ఒక చక్రవర్తీ, ఒక అవతారపురుషుడూ జన్మిస్తారని జ్యోతిష్కులు చెప్పటంచేత జంబూద్వీపంలోని అనేక రాజులు వారిని పెళ్లాడగోరారు. కాని వారి తండ్రి వారిని శాక్యరాజైన శుద్ధోదనుడి కిచ్చి వైభవంగా వివాహం చేశాడు.

ఒక ఏడు ఆషాఢసప్తమి నుంచి ఏడు రోజులుగా కపిలవస్తు నగరవాసులు ఆషాఢోత్సవాలు జరిపారు. నగరమంతా ఇంద్రలోకంలాగా అలంకరించి ఉన్నది. వారం రోజులూ నృత్యాది వినోదాలలో ఉల్లాసంగా గడిచిపోయాయి. చతుర్దశినాటిరాత్రి, అంటే ఉత్సవాలు ముగిసిన రోజున, మహామాయ పన్నీట స్నానం చేసి, పుష్పమాలాలంకృత అయి, దానధర్మాలు చేసి, హంసతూలికా తల్పంపై పడుకుని నిద్రపోయి, తెల్లవారు జామున ఒక కల గన్నది. ఆ కలలో ఒక తెల్లఏనుగు ఆకాశం నుంచి దిగివచ్చి, కుడి వైపునుంచి తన గర్భంలో ప్రవేశించినట్టు ఆమెకు కనిపించింది.

తెల్లవారి నిద్ర లేస్తూనే మాయాదేవి తాను కనిన కలను గురించి శుద్ధోదనమహా





రాజుకు చెప్పింది. అనాడే శుద్ధోదనుడు అరవైనలుగురు వేదపారంగతులైన బ్రాహ్మణులను పిలిచి, వారికి బంగారు పళ్ళాలలో భోజనాలు పెట్టి, ఆ పళ్ళాలను వారికి కానుకలుగా ఇచ్చేశాడు.

తరవాత ఆయన వారిని మాయాదేవి కలకు అర్థమేమిటని అడిగాడు.

" మాయాదేవి గర్భవతి అయింది. దేశమంతటా ఆనందోత్సవాలు జరిపించండి. ఈమె గర్భవాసాన పుట్టేవాడు ఐహిక జీవితం గడిపితే సామ్రాట్టు అవుతాడు; సన్యసించినట్టయితే మహాబుద్ధుడవుతాడు," అని బ్రాహ్మణులు చెప్పారు.

పది మాసాలూ నిండగానే మాయాదేవి తన భర్తతో, " నా పుట్టింటి వారిని చూడాలని ఉన్నది!" అని చెప్పింది. వెంటనే శుద్ధోదనుడు ఆమె ప్రయాణానికి ఏర్పాట్లు చేయించాడు. కపిలవస్తునుంచి వ్యాఘ్రపురానికి వెళ్లే దారిపైన ఇసక పోయించి చదును చేశారు. దారిపొడుగునా మంచి నీటి సదుపాయాలు చేశారు. బంగారు పల్లకీలో మెత్తలు పరిచి సిద్ధం చేశారు. మాయాదేవి స్నానం చేసి మేలి వస్త్రాలు ధరించి, సర్వాభరణ భూషితురాలై దేవతాస్త్రీలాగా వెలిగిపోతూ పల్లకీ ఎక్కింది. పల్లకీని పట్టటానికి వెయ్యిమంది ఉత్తమ క్షత్రియులు





ఆమె వెంట బయలుదేరారు. ఏనుగులూ, రథాలూ వెన్నంటిరాగా, మంగళ వాద్యాలతో మాయాదేవి తన పుట్టింటికి కదిలింది.

కపిలవస్తునగరం నుంచి వ్యాఘ్రపురానికి వెళ్ళే దారిలో, కపిలవస్తునగరానికి తూర్పుగా 15 మైళ్ళదూరంలో లుంబినీవనం ఉన్నది. ఈ వనం ప్రసిద్ధమైనది. ఇక్కడ విహరించటానికి రెండు నగరాల ప్రజలూ వచ్చేవారు. పల్లకీ లుంబినీవనం చేరగానే మాయాదేవికి అక్కడ కాస్సేపు విశ్రమించాలనిపించింది. ఎందుచేతనంటే అది వైశాఖమాసం; వసంతకాలం. వనంలోని చెట్లన్నీ విరగ బూసి కమ్మని సువాసనలు వెదజల్లు



తున్నాయి. పూవుల తేనె తాగుతూ తుమ్మెదలు ఝుంకారాలు చేస్తున్నాయి. చెట్లపైన రంగురంగుల పక్షులు కూర్చుని శ్రావ్యంగా పాడుతున్నాయి.

నిండు చూలాలైన మాయాదేవి ఈ వనంలో ప్రవేశించి దాని అందచందాలు గమనించి ఆనందిస్తూ నడవసాగింది. ఆమె ఒక సాలవృక్షాన్ని సమీపించేసరికి చప్పున ప్రసవం కలిగేలాగు ఆమెకు తోచింది. దేన్నయినా పట్టుకునే ఉద్దేశంతో ఆమె చెయ్యి చాచింది. వెంటనే ఆ సాలవృక్షం కొమ్మ ఒకటి కిందికి వంగి ఆమె చేతికి ఆధారంగా అందింది. ఆ క్షణంలోనే ప్రసవం ఆరంభమయింది.

ఆమెవెంట ఉన్న పరిచారికలు ఆమె చుట్టూ తెరలు అమర్చారు. మాయాదేవి తూర్పుముఖమై కూర్చుని, ఎటువంటి ప్రసవ వేదనా లేకుండా మగశిశువును కన్నది.

ఆనాడు వైశాఖ పౌర్ణమి, మంగళవారం, విశాఖా నక్షత్రం. అదే రోజున కపిలవస్తు నగరంలో యశోధర పుట్టింది; కంటకమనే గుర్రం పుట్టింది; చెన్నుడూ, ఆనందుడూ, కాలుదాయీ అనేవారు పుట్టారు; గయవద్ద బోధివృక్షం పుట్టింది.

[వీరందరికీ బుద్ధుడితో సంబంధం ఉన్నది. యశోధర బుద్ధుడికి భార్య





అయింది. బుద్ధుడు సన్యసించే నాటిరాత్రి కంటకం అనే గుర్రం ఎక్కి వెళ్లిపోయాడు. అప్పుడు బుద్ధుడివెంట వెళ్లినవాడు చెన్నుడు. ఆనందుడు బుద్ధుడికి యావజ్జీవ సపర్యలు చేశాడు. సన్యాసి అయిన తన కుమారుణ్ణి ఇంటికి తిరిగి రమ్మని కబురు చేస్తూ శుద్ధోదనుడు కాలుదాయిని దూతగా పంపాడు. గయలోని బోధివృక్షం కిందనే బుద్ధుడు బుద్ధత్వం పొందాడు.]

బుద్ధుడు పుట్టిననాడు అనేక అద్భుతాలు కనిపించాయని చెబుతారు.



దారిలోనే ప్రసవం పూర్తి కావటంచేత మాయాదేవి తన పుట్టింటికి వెళ్లక, తన శిశువుతోనూ, పరివారంతోనూ కపిలవస్తుకు తిరిగి వచ్చింది.

హిమాలయ పర్వతాలలో అసితుడనే ముని తపస్సు చేసుకుంటూ ఉండేవాడు. ఈయన తపస్సు ఏనాడో ఫలించటంచేత సమస్త లోకాలూ, కల్పాలూ ఈయనకు కోరినంతనే కనిపిస్తూ ఉండేవట. బోధిత్సుడు జన్మించిననాడు ఇంద్రలోకంలో దేవతలు ఆనందపారవశ్యంతో నృత్యాలు చేస్తూ ఉండటం గమనించి ఇంద్రపదవికి కొత్తగా మరొకరు వచ్చారేమోనని ఆయన అనుకున్నాడట. కాని ఆయన విచారించగా, కపిలవస్తురాజైన శుద్ధోదనుడికి కుమారుడు కలిగాడనీ, ముప్ఫైఅయిదు సంవత్సరాల అనంతరం అతను బుద్ధత్వం పొందనున్నాడనీ తెలుసుకున్నాడట.

వెంటనే అసితుడు కపిలవస్తునగరానికి వెళ్లాడు. శుద్ధోదనుడు ఆయనకు భక్తితో స్వాగతమిచ్చి, తన కుమారుణ్ణి తెప్పించి, తన చేతులతోనే ఆ బిడ్డను ముని పాదాల వద్ద ఉంచబోయాడు.

కాని ఆ శిశువుకు తన పాదాలు తగిలి నట్టయితే తన తల ఏడు చెక్కలుగా పగిలి పోతుందని భావించి అసితుడు ఆ శిశువు పాదాలు పట్టుకుని తన తలకు ఆనించు



కున్నాడు; తరవాత అయన ఆ శిశువు చూట్టూ మూడుసార్లు ప్రదక్షిణం చేశాడు. ఇదంతా చూసిన శుద్ధోదనుడు తానుకూడా తన కొడుకు ముందు ప్రణమిల్లాడు. శుద్ధోదనుడు తన కుమారుడికి చేసిన మొదటి ప్రణామం ఇదే.

"రాజా, నేను బ్రహ్మకూ, ఇంద్రుడికీ కూడా ప్రణామం చెయ్యను. నేను అజ్ఞాపించానంటే సూర్య చంద్రులు నిలిచిపోతారు. అయినా నేనీ శిశువుకు ప్రణామం చేశాను," అంటూ అసితుడు శిశువును పరీక్షించి ఆ శిశువులో ముప్ఫయిరెండు మాంగల్యలక్షణాలు గమనించాడు. ఆ శిశువు తప్పక బుద్ధుడవుతాడని తెలియగానే అసితుడి ముఖం ఆనందంతో వికసించింది.

తరవాత ఆయన భవిష్యత్తులోకి చూసి ఆ శిశువు బుద్ధుడై తత్వం ఉపదేశించేనాటికి తాను చనిపోయి ఉంటాననీ, ఆ బోధలు వినే గీత తనకు లేదనీ తెలిసి కన్నీరు కార్చసాగాడు.

అసితుడు మొదట నవ్వటమూ, తరవాత కన్నీరు కార్చటమూ గమనించిన శుద్ధోదనుడు మొదలైనవారు అదుర్దాపడి, "స్వామీ, తమరెందుకు విచారిస్తున్నారు? బిడ్డ కేమీ ఆపద రాసిపెట్టిలేదుకద?" అని ఆయనను అడిగారు.



"లేదు, లేదు. ఈ శిశువుకు ఎట్టి అరిష్టాలూ రావు. కాని ఇతను మరి ముప్ఫై అయిదేళ్లకు బుద్ధత్వం పొంది మానవులకు జన్మరాహిత్యం ఉపదేశిస్తాడు. ఆ ఉపదేశాలు వినటానికీ, బుద్ధుణ్ణి కళ్లారా చూడటానికీ నేను జీవించి ఉండనే అని విచారిస్తున్నాను," అన్నాడు అసితుడు.

తరవాత అసితుడు తనవారిలో ఎవరికి బుద్ధుడి దర్శనం లభించుతుందా అని ఆలోచించి, తన శిష్యుడూ మేనల్లుడూ అయిన నరదత్తుడికి ఆ అవకాశం ఉంటుం దని తెలుసుకున్నాడు. అందుకుగాను ఆ కుర్రవాణ్ణి తయారుచేయాలనుకున్నాడు.

ఆయన నరదత్తుడితో, "నాయనా, నీవు వెంటనే సన్యసించి తపస్సు ప్రారంభించు. బుద్ధుడి బోధలు విని తరించే అవకాశం నీకు లభించగలదు," అని చెప్పాడు.

నరదత్తుడు ఆ ప్రకారమే కాషాయ వస్త్రాలు ధరించి సన్యాసం పుచ్చుకుని హిమాలయాలలో తపస్సు చేశాడు. బుద్ధుడి బోధలు కాశీలో వినే అవకాశం కాలక్రమాన అతడికి లభించింది.

శిశువుకు అయిదవనాడు నామకరణ మహోత్సవం చేశారు. ఆ ఉత్సవం భారీ ఎత్తున జరిగింది. ఎందుచేతనంటే శుద్ధోదన మహారాజుకు ఈ బిడ్డ లేకలేక పుట్టాడు.





అనాడు శుద్ధోదనుడు నూటఎనిమిదిమంది బ్రాహ్మణులకు భోజనం పెట్టి పిల్లవాడి జాతకం ఎలా ఉండబోతుందని అడిగాడు. జాతకం గుణించటానికి ఎనిమిదిమంది బ్రాహ్మలు ఎన్నుకోబడ్డారు. వారిలో ఏడు గురు అభిప్రాయపడినదేమంటే ఈ శిశువు చక్రవర్తిగాని బుద్ధుడుగాని అవుతాడని. ఎనిమిదిమందిలోకీ చిన్నవాడైన సుదంతు డనేవాడు మటుకు, "ఈ శిశువు చక్రవర్తి ఎన్నటికీ కాడు, బుద్ధుడే అవుతాడు," అని ఖండితంగా చెప్పేశాడు.

బ్రాహ్మణులందరు కలిసి శుద్ధోదనుడితో, "మహారాజా, ఈ పిల్లవాడి మూలాన ప్రపంచానికి గొప్ప మేలు చేకూరుతుంది. అతని కోరికలన్నీకూడా సిద్ధిస్తాయి. అందు చేత ఇతనికి సిద్ధార్థుడని నామకరణం చేయండి," అన్నారు.

గౌతముడనేది శాక్యులవంశనామం. అందుచేత శుద్ధోదనుడి కొడుకు గౌతము డనీ, గౌతమసిద్ధార్థుడనీ, సర్వార్థసిద్ధి అనీ కూడా పిలవబడ్డాడు.

నామకరణ మహోత్సవంనాడు ఎనభై వేలమంది శాక్యులు ఉత్సవానికి హాజ రయారు. వారందరూ శుద్ధోదనుడిలాగే సిద్ధార్థుడు చక్రవర్తి అవుతాడని పూర్తిగా నమ్మారు. కాబోయే చక్రవర్తికి పరివారం కావాలి. అందుచేత వారంతా తమ కుమా రులను సిద్ధార్థుడితోపాటు విద్యాభ్యాసం చేయించటానికి నిర్ణయించారు.

సిద్ధార్థుడు జన్మించిన ఏడవరోజున మాయాదేవి జీవితం చాలించింది. శుద్ధో దనుడు తన కుమారుడికి పాలివ్వటానికి నూరుమంది దాదులను ఏర్పరిచాడు. మరీ పొట్టివాళ్ళు కాకుండా, పొడుగువాళ్ళు కాకుండా, అమిత ఆరోగ్యవతులైన వారుగా చూసి ఎన్నో వేలమంది స్త్రీలను పరీక్షించి ఈ దాదులను ఎన్నుకున్నారు.

—(ఇంకా వుంది)






అరేబియా ఎడారిలో బదావీలనే తెగకు చెందినవారున్నారు. వీరు ఒకచోట స్థిరంగా ఉండక ఎడారి అంతటా తిరుగుతూ ఉంటారు. మగపిల్లలు చిన్నతనం నుంచీ కత్తి పట్టటమూ, ఈటె విసరటమూ నేర్చుకుంటారు. హత్యలు చెయ్యటం వారికి ఉగ్గుపాలతో పెట్టిన విద్య. దోపిడీలు చెయ్యటం వీరికి పరిపాటి. బదావీ ముఠాలలో ఒక్కొక్క ముఠాకు ఒక్కొక్క పేరుంటుంది, కాని అందరూ ఇస్మాయిల్ సంతతి వారమని చెప్పుకుంటారు.

అనేక శతాబ్దాల క్రితం "బేనీసాద్" అనే ఒక బదావీ ముఠా ఉండేది. ఈ ముఠాకు ఒక నాయకుడుండేవాడు. అతనికి "ఎడారి భయంకరుడు" అని పేరుండేది. ఈయన కుమారులలో ఆఖరువాడు కనానా. వారి జాతిలో ఆఖరుకొడుకు తండ్రి తాలూకు గొర్రెలమందలను కాయటం అనాదిగా వస్తున్న ఆచారం. అందుచేత కనానా అయిదేళ్లు నిండగానే ఆడవాళ్లతోబాటు చల్ల చేయటమూ, వెన్న తీయటమూ మొదలైన పనులు చేసి, పదేళ్లు నిండగానే, కర్ర చేతబట్టి గొర్రెలనూ, ఒంటెలనూ కాచాడు.

ఇలా మూడేళ్లు జరిగాక తండ్రి కనానాను, "ఈటె పట్టటం నేర్చుకుంటావా?" అని అడిగాడు.

"నాన్నా, నేను అల్లా కోసమూ, అరేబియా కోసమూ అయితే తప్ప ఈటె పట్టి ఇతరుల ప్రాణాలు తీయలేను," అన్నాడు కనానా. చంపటమో, చావటమో తప్ప మరొకటి తెలియని జాతిలో పుట్టిన ఆ పసివాడిలో ఆ ఆచారవిరుద్ధమైన ఆలోచన ఎలా తల ఎత్తినదీ ఎవరూ ఊహించలేకపోయారు.

"నువు అరబ్బీవి కావుట్రా? ఇస్మాయిల్ సంతతివాడివి కావూ?" అని తండ్రి కోపంగా అడిగాడు.

జి. కేశవరావు





మారణాయుధాలు పట్ట నిరాకరించినప్పటికీ కనానాలో కొన్ని శక్తులుండేవి. వాడు జంతువులను సులువుగా వశపరుచుకునేవాడు. బేనీసాద్ ముఠాలో వాడితో సమంగా గుర్రంపైనగాని, ఒంటెపైనగాని సవారీ చేయగలవాడు లేడు. అన్ని ఆటలలోనూ వాడు మిగిలినవాళ్ళ కన్న రాణించేవాడు. వాడి చూపు చాలా నిశితమైనది. రాత్రివేళ గొర్రెలను ఎత్తుకుపోవటానికి ఎవరైనా వస్తుంటే మిగిలిన గొర్రెలకాపర్ల కన్న కనానా ముందుగా పసికట్టేవాడు. వాడు వడిసెల రాయి విసిరినంత దూరంగా, గురిగా మరెవరూ విసరలేకపోయేవారు.

కాని కనానాకు ఆ వాదం నచ్చలేదు. అల్లా సమస్త ప్రాణులనూ సృష్టించి రక్షిస్తాడని వాడు తెలుసుకుని ఉన్నాడు. తాను ఏ జంతువును హింసించినా అల్లా క్షమించడు. అలాటప్పుడు జంతువులకన్న ఎక్కువైన మనిషిని హింసించటం తప్పుకాదా?

కనానాను అందరూ హీనంగా చూడసాగారు. వాడు పిరికిపంద అని ముఠాకంతకూ అభిప్రాయం ఏర్పడిపోయింది. పౌరుషహీనుడనే ఉద్దేశంతో వాడికి హీనమైన పనులు చెప్పారు. అలాటి పనులు చేయటమూ, అందరిచేతా పిరికిపంద అనిపించుకోవటమూ కనానాకు చాలా బాధగా ఉండేది.

ఇవన్నీ యోధుడిలో రాణించే లక్షణాలే. అలాటి లక్షణాలన్నీ ఉండికూడా తన కొడుకు యోధుడు కావటానికి నిరాకరించటం ఆ ముసలి తండ్రిని మరింత కలవరపెట్టింది.

ఎడారి అంచున ఒక నదికి సమీపంలో బేనీసాద్ ముఠావారు ఏడాదికి మూడు మాసాలు మకాం వేసేవారు. వారక్కడ విత్తులు నాటి, పంట నూర్చినదాకా ఉండి తరవాత మకాం ఎత్తేవారు. నల్లటి కంబళ్ళతో తయారుచేసిన గుడారాలు దాదాపు అయిదువందలు నాలుగు సోల్పులలో వేసి





ఉండేవి. గుడారాలకు అటూ ఇటూ కను చూపు మేరదాకా వారి పొలాలు నది ఒడ్డున ఉండేవి. కంకులు పడ్డాక చేల వెంబడి మంచెలు కట్టి ఆడవాళ్లూ, ముసలివాళ్లూ, పిల్లలూ ఆ మంచెలమీదనే ఉండి వడి సెలలతో పిట్టలను తోలుతూ ధాన్యాన్ని కాపాడేవారు. గుడారాలనుంచి వారికి ఆహారం వచ్చేది. పంట కోసేదాకా చేలకు కాపలా ఉండేది.

ఈ యేడు కనానాను ఒక చివరఉన్న మంచెమీద పెట్టారు. వాడికి ఆ అవమానం కావలిసిందేనని అందరూ భావించారు. తన ముఠావారి గౌరవం సంపాదించటం ఎలాగో, తన ధైర్యాన్ని నిరూపించట మెలాగో వాడికి తెలియదు. అందరూ తనను పిరికివాడని తిడుతుంటే వినకుండా దూరాన పడి ఉండ టమే వాడికి మేలుగా తోచింది.

* * *

రేపు కోతలు ఆరంభిస్తారనగా కనానా తండ్రికి ఒక దుర్వార్త తెలిసింది. అతని ఇద్దరు కొడుకులు నాలుగు ఒంటెలపై తేనే, ఇళ్లుకట్టే మట్టీ వేసుకుని ఒక బిడారువెంట బయలుదేరి వెళ్లారు. దారిలో వారిని మరొక ముఠావాళ్లు దోచుకున్నారు. ఆ దొంగల ముఠాకు నాయకుడు రషీద్ అనేవాడు.




రషీద్ ముఠాకూ, బేనీసాద్ ముఠాకూ మధ్య వైరం ఉన్నది. అందుచేత వాడు కనానా అన్న లిద్దరినీ, నాలుగు ఒంటెలనూ పట్టు కున్నాడు. పెద్దవాడు బందీగా చిక్కి పోయాడు గాని రెండోవాడు పోట్లాడి తప్పించుకుని, గాయాలతో ఎలాగయితేం ఇల్లు చేరుకున్నాడు.

ఈ వార్త విన్న చిరాకులో, "ఎడారి భయంకరుడు" కనానా ఉన్న చోటికి వచ్చాడు. కనానా మంచెమీద కూచుని ధ్యానంలో ఉన్నాడు. పిట్టలు యథేచ్ఛగా పొలంమీద పడి తినేస్తున్నాయి. మధ్యాన్నం వచ్చిన ఆహారాన్ని కనానా ఇంతవరకు ముట్ట

లేదు. అసలు ఆ అహారం అక్కడ వున్నట్టు కూడా అతడు గుర్తించినట్టులేదు. ఇదంతా చూసి వృద్ధుడికి మండుకొచ్చింది.

"నా కడుపు చెడబుట్టావురా, నిర్భాగ్యుడా! నిన్ను చేనుకు కాపలా పెడితే పిట్టలనైనా కొట్టలేవు. నీకు మగపనులూ చేతకావు, ఆడపనులూ చేతకావు. ఎందుకు పనికొస్తావురా? నాకు వచ్చే మిగిలిన కష్టాలన్నీ ఒక ఎత్తూ, నువు ఒక ఎత్తూగా ఉన్నావే!" అని ఆయన కొడుకుమీద చిరాకుపడ్డాడు.

"నీకిప్పుడేం కష్టాలు వచ్చాయి, నాన్నా?" అన్నాడు కనానా.

"అందరికీ తెలిసినదికూడా నీకు తెలియదా?" అన్నాడు తండ్రి.

"మూడు వారాలుగా ఈ మంచె దిగలేదు. నాతో ఎవరూ మాట్లాడరు, ఏమీ చెప్పరు," అన్నాడు కనానా.

తండ్రి కనానాతో రషీద్ చేసిన అఘాయిత్యం చెప్పాడు. నిజానికి ముసలివాడికి పెద్ద నష్టమేమీ జరగలేదు. బిడారు వెంట వెళ్లి రషీద్‌కు చిక్కిన ఒంటెలలో ఒక్క తెల్లఒంటె మినహాయిస్తే మిగిలినవి మూడు ముసలివి. ఒంటెమీద ఉన్న సరుకుకూడా విలువైనదికాదు. అయినా ఆ తెల్ల ఒంటెనూ, తన పెద్ద అన్ననూ రషీద్‌నుంచి విడిపించి



ఇంటికి తీసుకురావటం తన ధర్మమని కనానాకు తోచింది.

"నాన్నా, నా కొక గుర్రమూ, ధాన్యం మూటా, మంచినీళ్ల తిత్తీ ఇయ్యి. రషీద్‌ను వెన్నాడి పోతాను. రషీద్‌ను చంపనుగాని, అన్ననూ, తెల్ల ఒంటెనూ విడిపించి తెస్తాను," అన్నాడు కనానా.

"ఏడిచావు, గడ్డిపోచవెధవా! కునికిపాట్లు పడకుండా చీకటి పడ్డదాకా పిట్టలను తోలు, అదే చాలు. రేపు ఉదయానే కోతలు ఆరంభిస్తున్నాం!" అన్నాడు తండ్రి.

"చీకటిపడినదాకా పిట్టలను తోలుతాను. కోతలకు ఉండను. తెల్లవారేసరికి ఎడారిలో నేను అన్నకోసం చాలాదూరం వెళ్లి ఉంటాను," అన్నాడు కనానా.

"నిన్ను నమ్మి నీకు గుర్రం ఇవ్వను," అన్నాడు తండ్రి.

"ఫరవాలేదు, నడిచి పోతాను. గెలిచి వచ్చేటట్టు ఆశీర్వదించు," అన్నాడు కనానా.

"గెలిచిరా, అప్పుడాశీర్వదిస్తాను," అన్నాడు తండ్రి.

* * *

సూర్యాస్తమయం అవుతూనే కనానా మంచె దిగాడు. చేను నుంచి సంచీనిండా ధాన్యం నించుకుని, దాన్ని భుజాన వేసుకుని, తన చేతికర్ర పట్టుకుని ఎడారికి






అడ్డంపడి వాయువ్య దిక్కుగా నడక సాగించాడు.

రషీద్ చేసిన దురంతం గురించి కనానాకు ఆటే వివరాలు తెలియవు. అతను దోచిన బిడారు కొద్దిరోజులక్రితం మక్కావేపు ప్రయాణమై వెళ్లింది. రషీద్ ఆ బిడారును దోచి తన ముఠాతో డమాస్కస్ దిక్కుగా వెళ్లిపోయాడు. ఎడారి మధ్య హూర్ అనే కొండ ఉన్నది. దాని శిఖరం పైన నిలబడితే నాలుగువైపులా చాలాదూరం దాకా ఎడారి కనిపిస్తుంది. రషీద్ ముఠా ఆ కొండను దాటిపోయే లోపుగా తాను ఆ కొండను చేరుకోలేడు. కాని ఆ కొండ ఎక్కితే



దూరాన ఎక్కడైనా రషీద్‌ముఠా జాడలు కనపడవచ్చునని కనానా ఆశ; ఎందుచేతనంటే అతని చూపు చాలా చురుకైనది. అదీగాక, ఆ కొండ బిడారులకు కూడలి. అరేబియానుండి ఉత్తరంగా జెరుసులేము, డమాస్కసు నగరాలకు వెళ్లే బిడార్లూ, సిరియానుంచి దక్షిణంగా మక్కా, మదీనాలకు వెళ్లే బిడార్లూ ఆ కొండవద్ద మజిలీ వేస్తాయి. ఎదురువచ్చే బిడారు ఏదైనా తగిలితే రషీద్ ముఠాగురించి వార్త తెలుస్తుందన్న ఆశతో కనానా హూర్‌కొండ కేసి బయలుదేరాడు.

కనానాకు దారితప్పుతానన్న భయంలేదు. పగలు సూర్యుణ్ణిబట్టీ, రాత్రి నక్షత్రాలను బట్టీ బదావీలు సులువుగా ఎడారిలోని ఏ ప్రాంతానికైనా వెళ్లగలరు. కనానా ఆ రాత్రల్లా నడిచాడు, మర్నాడు మధ్యాన్నం ఎండవేడి బాగా ముదిరినాక ఒక బండరాయి నీడను పడుకుని నిద్రపోయాడు. అతను అలా కాలినడకను రెండుపగళ్లు నడిచి రెండోనాడు సూర్యాస్తమయం లోపున హూర్‌కొండను దూరాన చూశాడు. ఆ కొండకింద చిన్నజల ఉన్నది. ఆ రాత్రి అతను ఆ జలలో నీరు తాగి దాని పక్కనే పడుకుని నిద్రపోయాడు.





తూర్పు తెల్లవారే సమయాన అతను నిద్ర లేచి చుట్టూ కలయచూశాడు. ఒక అరరోజు క్రితమే అక్కడ ఒక బిడారు మజిలీచేసి మక్కా మదీనాలకేసి వెళ్లి పోయిన లక్షణాలు అతనికి కనిపించాయి. ఆ బిడారువెంట తన అన్న ఉన్నాడని అతనికి గట్టినమ్మకం కుదిరి, తన పని సిద్ధిస్తుందన్న ఆనందం కలిగింది. ఆ బిడారుజాడ ఏమైనా కనిపిస్తుందేమోనన్న ఆశతో అతను ఆ కొండశిఖరానికి ఎక్కాడు. కాని ఈ ఆశ ఫలించలేదు.

ఇంతలో సూర్యోదయమయింది. కనానా ఉదయపు ప్రార్థన చేసి, తన ప్రయత్నంలో తాను నెగ్గేలాగు చేయమని భగవంతుణ్ణి ప్రార్థించాడు.

* * *

కనానా కొండ ఎక్కుతున్న సమయంలోనే ఆ కొండ కిందికి అయిదుగురు అరబ్బీ సైనికులు గుర్రాలమీద వచ్చారు. వారు అరేబియా ఉత్తరప్రాంతంనుంచి వస్తున్నారు. అతివేగంగా ప్రయాణంచేసి వచ్చిన ఆ సైనికులు కొండకింద గుర్రాలు దిగి, ఇంత ఆహారం తిని, తమ గుర్రాల తాళ్లు తమ శరీరాలకే కట్టేసుకుని, గడ్డిమీద పడుకుని నిద్రపోయారు.



మరికాస్సేపటికి ముగ్గురు బదావీ దొంగలు అటుగా వచ్చారు. గుర్రాలను కాజేయాలని వారికి పుట్టింది. కాని యజమానులను ముందు చంపేస్తేగాని గుర్రాలు తమకు దక్కవు. వారు ఆ అయిదుగురు సైనికులనూ పొడిచారు. దుస్తులూ, ఆయుధాలూ కొల్లగొట్టారు. తరవాత గుర్రాలను తీసుకుని, మూడింటిపైన సవారీ అయి మిగిలిన రెంటినీ నడిపించుకుంటూ వెళ్లిపోయారు.

దొంగలు పొడిచినప్పుడు సైనికులు పెట్టిన కేకలు కొండపైన ఉన్న కనానా విని తుళ్లిపడ్డాడు. అతను కొండపైనుంచి చూసే ఏదో ఘోరం జరిగినట్టు తెలుసుకున్నాడు.

కొండ దిగివచ్చినాక అతని కళ్లబడిన దృశ్యానికి అతని తల తిరిగిపోయింది. రక్తపు మడుగులు చూడలేక అతను ముఖం తిప్పుకుని పోతూఉండగా ఒక సైనికుడు బాధతో మూలగటం అతనికి వినపడింది.

కనానా ధైర్యం తెచ్చుకుని ఆ మూలిగే సైనికుణ్ణి సమీపించాడు. "దాహం! దాహం!" అన్నాడు సైనికుడు.

కనానా తన ఉన్నిసంచీతో జలనుంచి నీరుతెచ్చి కొనప్రాణంతో ఉన్న ఆ సైనికుడిచేత తాగించాడు. సైనికుడు కళ్లుతెరిచి కనానాను చూసి, "నాయనా, నీకింకా గడ్డాలూ మీసాలూ రాలేదు. కాని నువు అరబ్బీవాడివి. అరబ్బులను సర్వనాశనం చేసే ఉద్దేశంతో హిరాక్లీయస్ చక్రవర్తి కొడుకు కన్‌స్టన్‌టీన్ అంతులేని టర్కీ, గ్రీకు, రోమన్ సేనలతో రాబోతున్నాడు. ఈ విషయం ఖలీఫాగారికి చెప్పి సహాయం కోరటానికై మేము ఒక జాబు తీసుకునిపోతున్నాం. ప్రస్తుతం ఖలీఫా మక్కానగరంలో ఉన్నారు. ఆ జాబును అల్లా ప్రమాణంగా ఆయనకు అందజేస్తావా?" అని కోరాడు.

"అల్లా ప్రమాణంగా అందజేస్తాను!" అన్నాడు కనానా తడువుకోకుండా. సైనికుడు తన జేబునుంచి ఒక జాబు తీసి కనానాకిచ్చాడు. మరుక్షణం సైనికుడు ప్రాణాలు విడిచాడు.

తాను బయలుదేరిన పని మరిచి ఈ సైనికుడికి ఈ వాగ్దానం చేసినందుకు కనానా చాలా ఆశ్చర్యపడాడు. ఇది తనకొక పరీక్ష. అల్లాప్రమాణంగా తాను దానికి తల ఒగ్గాడు.

ఇంతలోనే అతనికి మరొక విషయం జ్ఞాపకంవచ్చింది. తాను వెంటాడే బిడారు దక్షిణంగానే వెళ్లింది. మక్కా అటుగానే ఉన్నది. అందుచేత, తాను సైనికుడికి చేసిన వాగ్దానం నిలబెట్టుకోవటానికి కనానా దారితప్పివెళ్ల నవసరంలేదు.

—(ఇంకా వుంది)





# ప్రకృతి వింతలు

## 7

కుమేవావా అతివేగంగా పరిగెత్తసాగాడు. నేను వాడితో సమంగా పరిగెత్తలేక పోయాను. చివరకు ఇద్దరమూ నదిని చేరి నీటిలోకి దూకాము. మొలలోతు నీటిలో నుంచి మేము ఒడ్డుకు చూస్తే నేలా, చెట్లూ, సమస్తమూ తారు పూసినట్టుగా చీమలు కమ్మేసి కనిపించాయి. అనేక కోట్లానుకోట్ల చీమలు! అవి చేసే టపటప చప్పుడుకు ఇప్పుడు మా చెవులు హోరెత్తిపోతున్నాయి. చూస్తూండగానే మాకు సమీపంలో ఉన్న నది ఒడ్డంతా నల్లటి తివాసీ పరిచినట్టయింది.

అంతలోనే చెట్లమీద ఉండే చీమలన్నీ దిగి వచ్చి ఒక పెద్ద బంతిలాగా తయారయాయి. తరవాత ఆ బంతి నదిలోకి దొర్లి అవతలి తీరానికి దొర్లుకుంటూ ప్రవాహం వెంబడి కొంతదూరం కొట్టుకుపోయి అవతలి ఒడ్డు చేరుకున్నది.

ఈ "సిపాయి చీమలు" అతి విచిత్రమైనవి. వాటి గమ్యస్థానం వాటికి తెలుసును. తమ దారికి నిప్పు అడ్డం వచ్చినా నీరు అడ్డం వచ్చినా అవి ఆగవు. అవి నిప్పులోకి జొరబడినప్పుడు కొన్నివేల చీమలు బూడిద అయిపోయి మిగిలినవాటికి బాట ఏర్పాటు చేస్తాయి. నీటిలో బంతిలాగా దొర్లినప్పుడు కూడా బంతికి వెలపలి ప్రాంతంలో ఉండే చీమలు చనిపోతాయి, కాని వాటి కళేబరాల సహాయంతో మిగిలినవి ముందుకు పోతాయి. సమష్టి క్షేమంకోసం వ్యక్తులు త్యాగమయే సూత్రం వాటికి తెలుసు.

చీమలు పోయాక మేము మంట వద్దకు వెళ్లి చూస్తే మా అడవిపంది అస్థిపంజరం మాత్రమే కనిపించింది. నిప్పంతా ఆరి బూడిద అయి ఉన్నది. "మనం ఇక్కడే ఉంటే మనంకూడా అలాగే అయి ఉండే

టిబోర్ సెకెల్య్





వాళ్లం," అన్నాడు కుమేవావా అడవిపంది అస్థిపంజరం చూపిస్తూ.

అరణ్యంలో ఉండే జంతువులలోకెల్లా ఘాతుకమైనదేదో నేను తెలుసుకున్నాను.

అడవిపంది అస్థిపంజరాన్ని అక్కడే వదిలి మేము అరణ్యంలోకి పోసాగాం. అకస్మాత్తుగా ముందు నడిచే నన్ను కుర్రవాడు నడుము పట్టి వెనక్కు గుంజాడు. నేను కింద పడిపోయాను. నాతోపాటు వాడు కూడా కింద పడుకున్నాడు.

వాడలా చేయటానికి కారణం నాకు త్వరలోనే తెలిసింది. ఒక బ్రహ్మాండమైన కొండచిలువ చెట్టుకొమ్మపైనుంచి జారుతున్నది. దాని నిడివి నాలుగు గజాలు మించిఉన్నది. అది అడవిలోకి వెళ్లిపోయిన దాకా మేమిద్దరమూ నేలను కరుచుకుని పడుకున్నాము. కొండచిలువ విషసర్పం కాదుగాని, అది జంతువులను చుట్టవేసి బలంగా నొక్కి ఎముకలన్నీ పిండిచేసి, తరవాత ఆ జంతువులను కబళిస్తుంది.

తరవాత మేము మళ్లీ మా నడక సాగించాము. కొంతదూరం వెళ్లాక కుర్రాడు ఆగి ఆలకించాడు. మా ఎడమపక్కగా ఆర్మడిల్లో అనే జంతువు వచ్చింది. అంత పెద్ద ఆర్మడిల్లోను నే నదివరకు చూసివుండలేదు. మమ్మల్ని చూస్తూనే అది బంతిలాగా ముడుచుకుపోయింది. అలా ముడుచుకుపోయినప్పుడు దాని కవచం దాని శరీరాన్ని రక్షిస్తుంది. ఆ బంతిలో నుంచి దాని తలా తోకా మాత్రమే తొంగి చూస్తున్నాయి.

కుమేవావా దాన్ని ఎత్తి తాడుతో కట్టటానికి ప్రయత్నించాడు. కాని అది వాడి చేతులలోనుంచి కిందికి దూకి మెరుపు వేగంతో అరణ్యంలోకి పారిపోయింది. మేమిద్దరమూ దాన్ని వెంబడించాము. అది ఒక దిబ్బలో ఉన్న బొరియలో దూరింది.

కుమేవావా మళ్లీ ఎండుకట్టెలు మథించి నిప్పు చేశాడు. ఈలోపుగా నేను చితుకులు





చేర్చాను. త్వరలోనే మంచి మంట చేశాము. మండే పుల్లలను బొరియ లోపలికి పెట్టి వాటిపైన ఒక చెట్టునుంచి కోసిన పచ్చి ఆకులు వేసేసరికి తెల్లని పొగ రాసాగింది. ఆ పొగ బొరియలోపలికి వెళ్లేలాగ కుమేవావా ఆకు విసనకర్రతో విసిరాడు. బొరియలోపల అర్మడిల్లోకు ఊపిరాడక కొట్టుకోవటం మాకు వినిపించింది. కొద్దిసేపటికల్లా అది బయటికి వచ్చింది. కుమేవావా దాన్ని పట్టుకో బోయాడు. అది ఊపిరాడక చావటానికన్నా ఒప్పుకున్నది గాని దొరికి పోవటానికి ఒప్పుకోక మళ్లీ బొరియలోకి పోబోయింది. అయితే దాని తోక కుర్రవాడికి దొరికిపోయింది. కాని అది వాణ్ణి బొరియ లోకి ఈడ్చసాగింది. దాని బలం అలాటిది.

వాడు నాకోసం కేకపెట్టాడు. నేనుకూడా వెళ్లి తోక పట్టుకుని లాగినా అది ఒకంతట బయటికి రాలేదు. ఎలాగో దాన్ని బయటికి లాగి అది పెనగులాడకుండా ఒక్క దెబ్బ వేసి, దాని మెడకు నారతాడు కట్టాం.

"కుమేవావా, నాకు దాహం అవుతోంది. ఇక్కడ తాగే నీరుండదేమో!" అన్నాను.

వాడు నన్ను ఒక్కక్షణం ఆగమని ఒక చెట్టు ఊడ రెండుగజాల బారున తన కత్తితో నరికి తెచ్చి, "ఇదుగో నీరు!" అన్నాడు.



వాడు నాతో పరిహాసం ఆడుతున్నాడను కున్నాను. కాని వాడు ఆ ఊడ ఒక చివర నోటిదగ్గిర పెట్టుకుని పైకి ఎత్తేసరికి అందులో నుంచి నిర్మలమైన జలం వాడి నోట్లోపడింది. వాడి తరవాత నేనూ నీరు తాగి దాని రుచికి అద్భుతం చెందాను.

"న్యికుచాప్‌కు నీటి ఊడల సంగతి తెలియదులాగుంది!" అన్నాడు వాడు.

"ఇదంతా నువ్వెప్పుడు నేర్చావు?" అని అడిగాను.

"అనుభవమూ, అవసరమూ కలిగితే అన్నీ తెలుస్తాయని మలోవాతాత అంటాడు," అన్నాడు వాడు.



మేము తిరిగి వచ్చేలోగా కుర్రవాడు బాణాలతో ఒక అడవిటర్కీకోడినీ, రెండు ఎర్ర చిలకలనూ, రెండు పచ్చ చిలకలనూ కొట్టాడు. వాడు యాభైగజాల దూరంలో ఉండే పక్షిని గురిగా కొట్టటం నేను చూశాను. వాడి జాతిలో నూరుగజాల దూరాన వున్న దాన్ని గురిగా కొట్టేవాళ్ళున్నారట.

మేము నౌకను చేరేసరికి అది ఒడుకు లాగబడివున్నది. దాని మరమ్మతుకూడా చురుకుగా సాగుతున్నది. దాని పనిలో నిమగ్నులైవున్న ప్రయాణీకులందరూ మమ్మల్ని చూడగానే పనులు కట్టిపెట్టి విశ్రాంతితీసుకున్నారు. అందరూ ఉదయం నుంచీ మాడుతున్నారు. మిట్టమధ్యాన్నం కావస్తున్నది. అందుచేత మేము తెచ్చిన ఆహారం చూసి అందరూ కుమేవావాను మెచ్చుకున్నారు. కొందరు వాణ్ణి భుజాల మీద ఎత్తుకుని మోస్తూ, "ముప్పైమందికి సరిపడే ఆహారాన్ని ఒంటరిగా వేటాడిన వాడివి సామాన్యుడివికావు," అని అభినందించారు. కుమేవావా నవ్వి ఊరుకున్నాడు. ఈ మెప్పు వాడికి పట్టినట్టు లేదు.

మగవాళ్ళు మళ్లీ నౌకపనిలోకి వెళ్లారు. మేమిద్దరమూ స్త్రీల సహాయంతో వంటపని సాగించాము. వంటలోకి మసాలాదినుసులు లేవు. కుమేవావా అరణ్యంలోకి వెళ్లి అడవి ఉల్లిగడ్డలూ, ఏదో చెట్టుబెరడూ తెచ్చాడు. ఈ బెరడు పొడిచేసి ఉల్లిగడ్డలతోబాటు కూరలలో వేస్తే మసాలా తయారయింది.

త్వరలోనే వంట పూర్తి అయింది. భోజనాలు కాగానే తిరిగి పడవను మరమ్మతు చేసేపని ప్రారంభించాము. దాని అడుగు భాగంలో రెండు చెక్కలుమాత్రమే దెబ్బ తిన్నాయి. రేపు ఉదయం ఆ పని పూర్తి అవుతుందని తెలిసింది. రేపు మధ్యాన్నానికల్లా కుమేవావాకు వీడ్కోలు చెప్పాలి కాబోలునని నేను విచారపడ్డాను.

—(ఇంకా వుంది)



# అవివేకి

కాశీనగరం వెలపల ఒక ముసలి గొల్లవాడుండేవాడు. వాడు రోజూ తన గొర్రెలను మేతకు వదిలి, ఒక చెట్టుకింద కూర్చుని, అత్యంత మధురంగా తన పిల్లన గ్రోవిపై పాడేవాడు. ఒకనాడు ఒక అప్సరస వాడి మురళీగానానికి ముగ్ధురాలై వాడి ఎదట ప్రత్యక్షమయింది. ఆమె ఆ ముసలివాణ్ణి తన మహిమచేత ఒక గంధర్వకుమారుడిలాగా మార్చేసి, "నువు మా లోకానికి వచ్చి ఎప్పుడూ నాకు మురళీ వినిపిస్తూండు!" అన్నది.

యువకుడుగా మారిపోయి దేవతావస్త్రాలు ధరించి వెలిగిపోతున్న గొల్లవాడు అప్సరసతో, "అలాగే వస్తాను. కాని నాకు రెండు గడియలు గడువిస్తే నగరంలోకి వెళ్లి ఎరిగినవాళ్ళకి వీడ్కోలు చెప్పి వస్తాను!" అన్నాడు. అప్సరస సరేనని వాడికి తెల్లటి గుర్రాలు పూన్చిన బంగారురథం ఇచ్చింది.

వాడు ఆ రథంలో ఎక్కి రాజవీథిని పోతూ ఉండగా మేడమీదినుంచి రాజకుమార్తె చూసి, "ఆ రథంలో వెళ్ళే యువకుణ్ణి నేను పిలుస్తున్నానని తీసుకురండి," అన్నది నౌకర్లతో.

రాజకుమార్తె తనను పిలిపించిందని తెలియగానే ఆమె తనని ప్రేమించిందని గ్రహించి గొల్లవాడు రాజకుమార్తె ముందు మోకరించి, "దేవీ, నన్ను వెంటనే పెళ్లాడు! నేను నీకు భర్తనై కాశీరాజ్యం ఏలుతాను!" అన్నాడు.

మరుక్షణమే వాడికి ఎప్పటి రూపం వచ్చేసింది. "ఎవడీ ముసలివెధవ? వీణ్ణి తక్షణం వీథిలోకి గెంటండి!" అన్నది రాజకుమార్తె.



# తమాషాలు

## నకలు దొంగ

ఒక సినిమానటికి ఖరీదైన ముత్యాలహారం ఉండేది. దాన్ని ఎవరూ తీసుకుపోకుండా ఉండగలందులకు ఆమె దానిని తాళంలేని సొరుగులోపెట్టి, దానిపక్కనే ఒక చీటీపై, "ఇవి నకలు ముత్యాలు," అని రాసిపెడుతూండేది.

అయినా ఎవరో ఆ హారాన్ని దొంగిలించారు. దొంగ ఆ సొరుగులో ఒక చీటీపైన ఇలా రాశాడు: "నేను నకలు దొంగను. అసలు దొంగ నిన్న పట్టుబడితే అతనికి బదులు వచ్చాను. నాకు నకలు ముత్యాలు చాలు."

## చిల్లరశలవులు

రంగడికి ఇద్దరు కవల తమ్ముళ్లు పుట్టారు. వాళ్ల నాన్న రంగడితో, "రంగడూ, ఈ వార్త మీ మేస్టరుగారికి చెప్పు, నీ కివాళ సెలవిచ్చేస్తారు," అన్నాడు. రంగడు స్కూలుకువెళ్లి త్వరలోనే గంతులువేసుకుంటూ తిరిగివచ్చాడు.

నాన్న: కవలపిల్లల మాట మేస్టరుగారికి చెప్పావా?

రంగడు: ఒక తమ్ముడి సంగతే చెప్పా, నాన్నా.

నాన్న: ఏం?

రంగడు: రెండోతమ్ముడి సంగతి పైవారం చెప్పి ఇంకోరోజు సెలవుగుంజేస్తా!

## తండ్రిపోలిక

ఒక ముసలాయన తన కొడుకుతో, "ఒరే నీ కొడుకు చిన్నతనంలో నీకన్న తెలివిగా కనిపిస్తాడురా!" అన్నాడు.

"అవును, నాన్నా. నా తండ్రికన్న వాడి తండ్రి తెలివిగలవాడు కాదూ!" అన్నాడు కొడుకు.

---

గతనెల ప్రశ్నలకు సమాధానాలు

1. అందరు బంధువులూ మళ్లీ ఒక్కరోజు మాత్రమే కలుస్తారు. ఎవరూరాని రోజులు 24.

2. తాత 1866లో పుట్టాడు; 1932 నాటికి 66 ఏళ్లవాడు. మనవడు 1916లో పుట్టాడు 1932 నాటికి 16 ఏళ్లవాడు.

3. రంగడి వద్ద మొదట ఉన్న మొత్తం 1 రూపాయీ 5 నయా పైసలు.

## ఫోటోవ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

1959 మార్చి సంచికలో ప్రకటింపబడే ఫోటోలకు నమూనాలు





★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ జనవరి నెల 10-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/-లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26.

## జనవరి నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : గంగాభరణములు

రెండవ ఫోటో : గగన తోరణములు

పంపినవారు : ఎం. మురళీమాధవశర్మ,

ఎం. హెచ్. స్కూల్, బళ్లారి.

బహుమతిమొత్తం రు. 10/- ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

# చిత్రకథ





ఒక రోజున దాసూ, వాసూలు పెద్ద గాలిపటం ఒకటి తయారుచేసి ఎగరవేసేందుకు ఊరి బయటికి వెళ్లారు. అక్కడికి ఒక పెద్ద కుర్రాడుకూడా గాలిపటం తీసుకునివచ్చాడు. పెద్ద కుర్రాడు దాసూ, వాసూలతో పందెంవేశాడు. గాలిపటాలు వదిలారు. పెద్ద కుర్రాడి గాలిపటానికి చాలా దారం వుండటంతో అది మరీమరీ పైకి పోతున్నది. ఆ సమయంలో 'టైగర్' వాసు చేతిలోవున్న గాలిపటం దారాన్ని నోట కరుచుకుని పరిగెత్తింది. గాలిపటం 'టైగర్'ను గాలిలోకి లేపి, దాపులవున్న నీటిమడుగులో పడవేసింది. ఈలోపల దాసూ వాసూల గాలిపటం, పెద్ద కుర్రాడి గాలిపటానికన్న ఎత్తుగా వెళ్లిపోయింది.





Printed by B. NAGI REDDI at the B. N. K. Press Private Ltd., and Published by B. VENUGOPAL REDDI for Sarada Binding Works, 2 & 3 Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'



గెలిచినా, ఓడినా

అంత పట్టింపు లేదు—

మాకు ఉత్సాహం కలిగించే

టీ వుంటే

అదే చాలు!





నేను టీనే

ఆడేవారికి,
చూసేవారికి కూడా
నేను సేవ చేస్తాను




PST 201

# ప్రెసిడెంట్
## టాయ్‌లెట్స్

ప్రెసిడెంట్
డిలక్స్ టాయ్‌లెట్ పౌడరు
—రమణీయ సౌందర్యానికి

★

ప్రెసిడెంట్ స్నో
—సుందరమైన వర్చస్సుకు






సినిమాతారలందరిచే
వాడబడుతున్నవి.

**RATHOD TRADING CO., MADRAS-1**

---

# అమృతాంజనము




## బాధలను లాగి వేస్తుంది



అమృతాంజనము 65 సం॥ పైగా పేరొందినది. తలనొప్పి, బాధలు, కీళ్ళ నొప్పులు, బెణుకులు, పళ్లనొప్పి మొదలైన వాటికి అమోఘంగా పని చేస్తుంది. బాధగా ఉండేచోట మాత్రం వాడటంవల్ల అమృతాంజనం మీకేమాత్రం హాని కలిగించదు.

మీరే వాడి చూడండి. కొంచెం అమృతాంజనం అరచేతిలో వేసి బాధగా ఉన్నచోట మర్దనా చేయండి. నిమిషాలలో నొప్పి మాయమౌతుంది.
అమృతాంజనమునే వాడి చూడండి.
9 లో 7 రకాల
బాధలను లాగి వేస్తుంది.




అమృతాంజన్ ఇన్‌హేలర్ జలుబునకు ముక్కు దిబ్బడను పోగొట్టును

అమృతాంజన్ లిమిటెడ్
మద్రాసు-4
బొంబాయి-1, కలకత్తా-1

# హెర్క్యులిస్ నిజానికి సైకిల్‌కంటె ఎక్కువైనది
## ... అది జీవిత భాగస్వామి

ఇంటివద్ద ఒక హెర్క్యులిస్ సైకిల్ ఉంటే. ఆఫీసు-మార్కెట్టు-బడి—ఇవన్నీ సులభంగా అందుబాటులో ఉంటవి. ప్రతి వారికి ఎక్కువ తీరిక కూడ చిక్కుతుంది. నాన్నగారు ఇంటికి త్వరగా వస్తారు. అమ్మకు కావలసిన వస్తువులన్నీ సకాలంలో అందుతాయి. కుటుంబంలో ఎక్కువ సంతుష్టి ఏర్పడుతుంది. జీవితంలో మనిషికి హెర్క్యులిస్ ఉపయోగపడినంతకాలం పనికివచ్చే ఇతర వస్తువులు బహుకొద్దిగా ఉంటవి.



శ్రేష్ఠమైన సైకిళ్ళను తయారుచేయటంలో దాదాపు 50 సంవత్సరాలు గడించిన అనుభవంతో టి. ఐ. సైకిల్స్ వారి ఆధునిక కర్మాగారంలో హెర్క్యులిస్ దృఢంగాను, నిర్దుష్టంగాను తయారుచేయబడింది. అది అందంగా ఉంటుంది. ఏమాత్రం శ్రమ లేకుండా సాఫీగా నడుస్తుంది. అందువల్ల ఈ రోజుల్లో మీరు కొనగల సైకిళ్ళలో హెర్క్యులిస్ ప్రశస్తమైనది.

మీ సైకిల్ మీకు పెట్టుబడి

**హెర్క్యులిస్**

మీ డబ్బుకు ఉత్తమమైన ప్రతిఫలం

తయారీ :
టి. ఐ. సైకిల్స్ ఆఫ్ ఇండియా
లిమిటెడ్, మద్రాసు






TIC 313A

Photo by Anant Desai



బహుమతి
పొందిన వ్యాఖ్య

గగన తోరణములు

పంపినవారు :
ఎం. ఎం. శర్మ -బళ్లారి

